జూలై - 1991

# స్రవంతి

'సాహిత్య చర్చా వేదిక స్రవంతి మాసపత్రిక'




దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర,

ఖైరతాబాదు, హైదరాబాదు-500 004

# హార్దిక ధన్యవాదములు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర, హైదరాబాద్‌కు 1991 జూన్‌నెలలో జరిగిన ఎన్నికలలో నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నందుకు వ్యవస్థాపికా సమితి సభ్యులకు నా హృదయ పూర్వక ధన్యవాదములు తెలియజేయుచున్నాను. అధ్యక్షునిగా ఎన్నికైన తరువాత పలుపురు పెద్దలు హిందీ అభిమానులు, హిందీ ప్రచారకులు, మిత్రులు నన్ను అభినందిస్తూ టెలిగ్రాములు, జాబులు పంపి నా యెడల జూపిన ఆదరాభిమానాలకు మిక్కిలి కృతజ్ఞుడను. అందరకు హార్దిక వందనములు.

సర్వశ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశం పంతులు, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, స్వామీ రామానంద తీర్థ, యం.వి. పావన్నగుప్త, శీర్ల బ్రహ్మయ్య వంటి మహనీయులు ఆంధ్ర సభకు అధ్యక్షులుగా వుండి మనకు మార్గదర్శకులైనారు. వారి అడుగుజాడలలో పయనిస్తూ, మన సభ సర్వతోముఖ వికాసానికి, హిందీ ప్రచారాభివృద్ధికి అందరి అండదండలతో యథాశక్తి కృషి జేయగలనని విన్నవించుకొనుచున్నాను.

జాతిపిత మహాత్మాగాంధి ప్రసాదించిన నిర్మాణ కార్యక్రమంలో జాతీయ భాషా ప్రచారం ప్రధానమైనది. భారత జాతీయ, సాంస్కృతిక సమైక్యతకు హిందీ ప్రచారం ముఖ్య సాధనం. "ఏక్ హృదయ హో భారత జననీ" మన లక్ష్యం. జాతి, మత, కుల, ప్రాంతీయ విభేదాలకు అతీతమైనది మన హిందీ ప్రచార ఉద్యమం ఈ ఉద్యమానికి మన రాష్ట్రంలో ప్రచారకులు, ప్రజలు, ప్రభుత్వ సహకారంతో ఒక నూతన చైతన్యం వెల్లివిరియాలి. ఇందుకు అవసరమగు కార్యక్రమాలు రూపొందించుకొనడానికి మీ అమూల్యమైన సలహాల నిస్తూ, ఇతోధిక సహాయ, సహకారాల నందజేయ వలసినదిగా సవినయముగా ప్రార్థించుచున్నాను.

ఇట్లు

మీ

బోయపాటి నాగేశ్వరరావు

అధ్యక్షుడు,

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర,

హైదరాబాద్

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

వార్షిక రుసుము : రూ. 15/-లు    విడిప్రతి : రూ. 1-50

సంపుటి : 38    జూలై 1991    సంచిక : 4

446

సంపాదకులు

పి. ప్రసాదరావు

కార్యాలయము

దక్షిణ భారత హిందీ
ప్రచార సభ- ఆంధ్ర,
ఖైరతాబాద్, హైదరాబాద్
పిన్‌కోడ్-500 004

ఈ సంచికలో    పేజీ

# సంపాదకీయం

ఆలోచనే మనిషిని నడిపిస్తుంది. మనసుని పరుగు పెట్టిస్తుంది. పరిపక్వత చెందిన మేధలో పరిణతి చెందిన ఆలోచనలు ఉద్భవిస్తాయి. మనిషి మనీషిగా మారినా, రాక్షసుడుగా రూపొందినా అది అతని ఆలోచనలలోని పొరల్లోంచి పెల్లుబికే చైతన్యమే.

మానవతను దుర్లభమనుచు నెంచి పరమానందాన్ని పొందలేక, మదం, మత్సరం, కామలోభ మోహాలకు దాసుడనై తిరిగానని, నరాధముల చేరి సారహీనపనులు చేశానని నాదయోగి త్యాగరాజస్వామివారు తన పంచరత్న కీర్తనలో వాపోతాడు.

కోపం శత్రువని, పరనింద మృత్యువని, విషయవాంఛలు ఉరితాళ్ళని నమ్మి తెలుసుకొని కొలవలేక పోయానని ఆ కొండల దేవుని తిరుమల విభుని శ్రీనివాసుని, పదకవితాపితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు సంకీర్తనల ద్వారా స్తుతించి ఆవేదనను వ్యక్తీకరిస్తాడు.

రాధామాధవుల శృంగార భావనా ప్రపంచంలో మనల్ని ముంచెత్తే రచనలు చేసిన క్షేత్రయ్య కూడా తన పదాలలో ఆ ఆలోచన చేసే దురితాల్ని ఒకింత అక్షింతలు వేసిన సందర్భాలూ లేక పోలేదు.

'అబ్బురిట్టెనంచు' అని తన బుద్ధి మాంద్యతను గురించి స్వచ్ఛమైన తేట తెలుగులో రామదాసు ఉటంకించాడు.

ఎవరెన్ని అన్నా ఏమన్నా తమ మెదడులో కలిగిన ఆలోచనలని గురించి పశ్చాత్తాపాన్ని చెందేవారే! ప్రయోజనం లేనిపనికి పాకులాడటం, అర్థంలేని అవసరాలకు వెంపర్లాడటం కేవలం అవివేకుల లక్షణం.

ఇనుప నరాలు, ఉక్కు కండరాలు, వజ్ర సమానమైన మనస్సు ఉండాల్సిన యువత ఆలోచనల్లో కూడా విద్యుత్తు ప్రవహించాలి. విజ్ఞత ఉండాలి కాని తమస్సు కాదు. వివేకం ఉండాలి కాని, వినోదంకాదు. సాహిత్యకారులు కూడా సమాజంలో నేడు జరుగుతున్న అన్ని దురితాలకూ ఈ ఆలోచనే కారణం అని కనిపెట్టి....రచనలు సాగిస్తూ సమాజానికి పట్టిన కాలుష్యాన్ని రూపు మాపటంలో, పబ్లికేషన్ అనే పొగగొట్టాన పోయే సాహిత్యానికి అడ్డు వేయటంలో సహాయపడగలరు.

# భారతి

జి. రఘురామశర్మ

ఇది నవోదయ విద్యాలయ మహత్తెంతైన కల్గించు న
భ్యుదయంబైన విశిష్ట జ్ఞాన కళ సంపూర్ణత్వమున్ జెందు సం
పద యై: ఉన్నది భారతోర్వి జవహార్ భావంబు పొందించ నిం
పొదవన్ వెల్గెను కార్యదక్షత జగన్మోహంబు విఖ్యాతమై॥

బహు భాషలను నేర్పు బహుళ జాతికి వేల్పు
నిది నవోదయ విద్య చదువరులకు
కవి కల్పనల నల్పు కవ్వింపు శిల్పమై
నిది నవోదయ విద్య చదువరులకు
క్రమశిక్షణమున సత్క్రమబుద్ధి పెంపొంద
నిది నవోద విద్య చదువరులకు
పండిత కళలకు నిండిన వెలుగుల
నిది నవోద విద్య చదువరులకు.

వృత్తి ధర్మత నెపు డభివృద్ధి పరుప
కొదువ లేకుండ జెప్పెడు కోవిదులకు
నిది జగన్మోహనాకార ముదయ దీప్తి
ఫలితమందించు సంస్కారవంతులకును
భరతమాతరో సంతృప్తి పడెదవమ్మ.

# కళ్యాణ పతాక

పోతుకూచి సాంబశివరావు

ఈ అనంత విశాల భువనం పై
ఆలోచనల క్రిములు పాకుతున్నాయి
ఒక పెనుగాలి, ఒక భూకంపం చాలు
క్రిములు సంద్ర సలిలాల్లో శవాలౌతాయి.
మనిషి మేధస్సు విప్లవానికి
కటకటాల జైలుగోడల్లో
సమాధి రాళ్ళ నికేతనాలు స్థాపించలేరు
ఆలోచనలు ఒక వేడి వాతావరణం
అందులో నూత్న సృష్టి పొదిగి ఎదుగుతుంది.
పచ్చని ప్రకృతి తన చలవ హస్తాలలో
మనిషికి ఆనందం జోల పాడుతుంది.
కోట్ల నక్షత్రాల వెలుగు కాంతుల మధ్య
ఎదిగి వెలిగిన కాంతి రేఖల ఆలోచనలు
భువన కళ్యాణ పతాకా లెగరేస్తాయి.

# రైతు

డా॥ మాధవరావు రేగులపాటి

...    ...    ...
...    ...    ...
అన్నం తినుకుంటు
పొలంగట్టున కూర్చున్న
ఆ రైతును చూస్తే
జీవిత సమరంలో
ఆమడలు దాటేసిన
మండేలా, మైసన్‌లా
మహాత్ముడిలా............
మహానుభావుల్లా
అగుపిస్తున్నాడు.

ఎగిరేసిన జుట్టుతో
దైన్యం నింపుకున్న ముఖంతో
కట్టుకున్న అంగారేకతో
చుట్టుకున్న లుంగీతో
అలుముకున్న దుమ్ముతో
అంటుకున్న బురదనీళ్ళతో
ఆకారాన్ని దిద్దుకొని
అచ్చంగా దారిద్ర్యపు బిడ్డగా
దైన్యపు సహోదరుడుగా
హైన్యపు అనుచరుడుగా
లోకానికి అగుపిస్తున్నాడు—అయినా
పిడికిలి బిగించి పైకెత్తిన చేతిలా
పిడుగులు కురిపించే ఆకాశంలా
ఎగిరేసిన విజయ పతాకంలా
ఎగిసిపడే సంద్రపు కెరటంలా
ఎగిరిఎగిరిదూకె జలపాతంలా
కనిపిస్తున్నాడు నాకు
జనంలోని శ్రమకతడు సాకు
జగంలోని నిట్టూర్పుకతడు బాకు

# కర్తవ్యం

సూర్యదేవర రవికుమార్

నిస్సహాయతా పర్వంలో నిలబడి
సర్వంశూన్యమన్న మనసుతో
నిట్టూర్పులు విడిచి ప్రయోజనంలేదు తమ్ముడూ!
నీ అదిరిపాటు ఆలోచనల ఆవేశకావేషాలు
అనుకొన్నపనిని సాధించలేవవి
అర్థంకాలేదా ఇంకా !

నీచుట్టూ నానాజాతివృక్షాలు-
వాటిలో
తననీడన మరొకదాన్ని బ్రతుకనీయని దొకటి
పరాశ్రయమే పరమావధిగా గలది వేరొకటి
చుట్టూ తనవాళ్ళనే సృష్టించుకొనేది ఇంకొకటి
విశాలంగా విస్తరించిన ఏకచ్ఛత్రాధిపతి మరొకటి
వీటితో పోటీపడలేని కొన్ని
విసురుగాలితో దూరంగా పంపిస్తున్నాయి తమ
బీజాల్ని
తమ అస్తిత్వాన్ని నిలుపుకోలేక
క్రమంగా రూపుమాసిపోతున్నాయి మరికొన్ని

అయినా ఎన్నోవృక్షాలు
అందిస్తాయి అమృతఫలాలు
నిస్వార్థబుద్ధితో; నిజాయతీ మనసుతో
అవనత శిరాలతో; వినయ హృదయాలతో
ఎన్నో రాక్షసవృక్షాలు, మరెన్నోరాకాసి తీగలు
కఠోర కంటకాలతో, రంగుల విషఫలాలతో
వాటిని కబళించాలని కాటేస్తుంటే
వాటిని ఛేదించటానికి నువ్వెత్తిన గండ్రగొడ్డలిని
సైతం
వాటేసుకొని ఇరియించు కొన్నాయి

కర్తవ్యతామూఢుడివి కాకు
కావలసినది నిప్పువంటి ఆలోచన నీకు
పుట్టించు వెచ్చగా దానిని నీమనసులో
ప్రజ్వరిల్లజేయి విశ్వశాంతి కళ్యాణకాంక్షాజ్యంతో
అప్పుడు అది దహిస్తుంది
ఆ కంటక సమూహాన్ని
అహమహమిక తో పోటీపడుతున్న
అసురప్రవృత్తి మానవారణ్యాన్ని

రి: ప్రసవంతి, జూలై '91

# పాహిమాం! పాహిమాం

సందినేని రవీందర్

కుటిలనీతి పోకడలను
కూకటివ్రేళ్ళతో త్రుంచేయ్
పురోభివృద్ధికి తిరోగమనం
అడ్డొస్తుంది
దానిని నడిమికి విరిచేయ్
సాధించిన విజ్ఞానానికి
అజ్ఞానం తోడై
అణుబాంబుల వికటాట్ట
హాసం చేస్తుంది
చూడు తమ్ముడూ
అటు వైపు
ఉదయుని కిరణం
సోకని భూగర్భంలో
నల్లని బొగునుతీసి
ప్రపంచానికే
శక్తిని యిస్తున్న
సోదరుని శ్రమకు
ఫలితమేది............
మట్టిని నమ్ముకొని
ప్రపంచానికే భుక్తిని
ఇస్తున్న రైతుకు
గిట్టుబాటు ధరలేక
తల్లడిల్లుతున్నాడు చూడు
ఓ శాస్త్రవేత్తలారా........
మీరు పండించిన
పంటంతా
విశ్వగోళాన్ని వినాశనం
చేస్తున్నది
ఆ బాంబుల వికటాట్ట
హాసాన్ని ఆపి
ప్రపంచంలో
శాంతివర్షం
కురిపించండి.

# తెలుగు వెలుగు

పొన్నగంటి హనుమంతరెడ్డి

తెలుగు వెలుగును చూడర/వె తమ్ముడూ/చెల్లెలా
తెలుగుభాష శ్రీకార ఆద్యుడు మన నన్నయ్య
తెలుగును శాఖోపశాఖల విస్తరుడు తిక్కయ్య
తెలుగు భారతము నిండుదనాన్నిచ్చిన ఎఱ్ఱయ్య
తెలుగువారి నుద్ధరించిన సి. పి. బ్రౌనుదొర ॥తెలుగు॥

తెలుగుదేశ దీనజన హరిజనోద్ధరణ దాత కట్టమంచి
తెలుగు సంఘ సంస్కరుడు వీరేశలింగం పంతులు
తెలుగులో ఆటవెలది ఈటెల విసిరిన వేమన్న
తెలుగువెలుగుల చందమామ మనుమసిద్ధి ॥తెలుగు॥

తెలుగోల్లకొండ అందరి అండగాఁజేసిన తానీషా
తెలుగు అమ్మలక్కల తేనెలచుక్క రాణిరుద్రమ్మ
తెలుగునాటక పితామహుడు బళ్ళారి రాఘవ
తెలుగుజాతి విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు ॥తెలుగు॥

తెలుగువెలుగుల జాడల చెలికాడు గురజాడ అప్పారావు
తెలుగుతల్లి అష్టదిగ్గజాల పోషకుడు రాయలు
తెలుగుభాషను స్వేచ్ఛగా నడిపించిన ఘనుడు శ్రీశ్రీ
తెలుగు రామనామమందె రమ్యంగనిన ప్రభువు రామదాసు ॥తెలుగు॥

తెలుగు వారికందరికి చాపకూటిని పెట్టించిన బ్రహ్మనాయుడు
తెలుగు గానాలను దశదిశల విన్పించిన అన్నమయ్య
తెలుగువారికి ప్రత్యేకరాష్ట్రం సాధించిన పొట్టిశ్రీరాములు
తెలుగు వెలుగునందు నిలువ ఎవరి తరమోయి
తెలుగు వెలుగుపొందు కలువపూల తేనెపొందు ॥తెలుగు॥

స్రవంతి ; జూలై '91

కథానిక:

# మాతృ హృదయం

బి. విద్యాసాగర్

కుమారస్వామి సోఫాలో కూర్చుని వార పత్రిక చదువుతూ వొకసారి భార్యవంక చూశాడు. రుక్మిణి వొక కుర్చీలో కూర్చుని స్వెటర్ అల్లుతోంది. కుమారస్వామి ఆమెను చూసి జాలిపడ్డాడు. తమ దురదృష్టానికి మనస్సులో బాధపడ్డాడు. ఆమెకు సంతానం కలుగలేదు. ఇక ముందు పిల్లలు పుడతారని ఆశకూడా లేదు. అయినా రుక్మిణి పిల్లల కోసం తపించి పోతున్నది. చుట్టుపక్కల యిళ్ళలో వున్న పిల్లలను దగ్గరకు పిలిచి చాక్లెట్లు, బిస్కట్లు పంచిపెట్టి, వారి ఆనందంలో పాలు పంచుకుంటూ వుంటుంది. పసి పిల్లలకు స్వెట్టర్లు అల్లిపెట్టి యిస్తూ వుంటుంది. ఆ విధంగా తమకు పిల్లలులేరనే బాధను మరచిపోవడానికి ప్రయత్నిస్తూ వుంటుంది.

రుక్మిణి అల్లడంపూర్తిచేసి, వాటిని బీరువాలో పెట్టింది. కుమారస్వామి, అది గమనించి 'లైటు తియ్యమంటావా.' అన్నాడు. స్విచ్ బోర్డు వైపుకు వెళ్తూ. 'తీయండి' అంటూ రుక్మిణి బెడ్‌రూమ్ వైపుకు నడిచింది. లైటు తీసి చీకటిలో ఆమె వెంట నడిచాడు.

కుమారస్వామి వుద్యోగంలోనుంచి రిటైర్ అయి మూడు సంవత్సరాలయింది. ఒక కాలేజీలో లెక్చరర్‌గా చేరి మంచి పేరు సంపాదించుకుని, ప్రిన్సిపాల్‌గా రిటైరు అయినాడు. ఆయనకు సిరి సంపదలకు లోటు యేమి లేదు. కానీ సంతానమే లేదు! అదే జీవితంలో తీరని కొరత! అందుకు మానసికంగా భార్యతోపాటు నిత్యమూ బాధపడుతూ వుంటాడు. మొదట్లో తమకు సంతానం కలుగుతుందని భావించారు, కానీ కాలక్రమేణ, తమకు ఆ యోగం లేదని గ్రహించారు. ఉద్యోగంచేస్తున్న కాలంలో యెటువంటి యిబ్బందులు, సమస్యలు యెదుర్కొనలేదు. జీవితం సాఫీగా సాగిపోయింది. ఇప్పుడు వుద్యోగం నుంచి రిటైరు అయి, యింట్లో వూరికే కూర్చుంటే, కాలక్షేపం కరువయి, పిల్లలు లేని కొరత బాగా కనిపిస్తోంది

రుక్మిణి కూడా తాను పిల్లలులేని గొడ్రాలు నని తీవ్రంగా బాధపడుతోంది. జీవితం అంతా శూన్యంగా గోచరిస్తుంది. ఏదో తీరని వెలితి, అసంతృప్తి! పిల్లలు లేనిదే, యెన్ని సిరిసంపదలు వున్నా వ్యర్థమని భావిస్తోంది. భగవంతుడు తమకు యెందుకీ కఠిన శిక్ష విధించాడని మథనపడుతోంది.

కుమారస్వామి మంచంమీద పడుకున్నాక, భార్య యెంత సేపటికి నిద్రపోక పోవడం గమనించి, 'నిద్ర పట్టడంలేదా!' అని అడిగాడు.

'లేదు'

'ఏమి! వంట్లో బాగాలేదా!'

'బాగానేవుంది, ఏదో ఆలోచిస్తున్నాను'

'దేని గురించి?'

'మన పక్కింటి రంగమ్మగారికి వంట్లో జబ్బుగా వుందని మీకు తెలుసుగదా! ఆవిడను హైదరాబాద్‌కి తీసుకు వెళ్ళమని డాక్టర్లు సలహా యిచ్చారు. ఆవిడ, ఆవిడ తమ్ముడు త్వరలో హైదరాబాద్ వెళ్తారు మరి, ఆ చిన్న పిల్లలు యిద్దరినీ యేమి చేస్తారో, తెలియకుండా వుంది. వాళ్ళకు స్కూలు పోతుంది. ఆవిడ భర్త పోవ డంతో సమస్య వచ్చి పడింది.'

'ఏమి చేద్దామనుకుంటున్నారు?'

'ఇంకా యేమి తేల్చుకోలేదు. ఆవిడ బాధపడు పడు తున్నది...పోనీ, వొకపనిచేద్దామా! ఆవిడ వొక నెల రోజులు హైదరాబాద్‌లో వుండాలి. ఆ నెల రోజులు పిల్లల్ని మన దగ్గర వుంచుకుని కని పెట్టి వుందామా?'

'నువ్వు చెప్పింది బాగానే వుంది కానీ మనం. ఆ పిల్లలతో వేగగలమా అని నా భయం.'

'మీకా భయమేమీ అక్కరలేదు. వాళ్ళసంగతి నేను చూసుకుంటాను. పాపం! రంగమ్మ గారికి వూళ్లో బంధువు లెవరూ లేరు. ఏదైనా హాస్టల్‌లో చేరుద్దామంటే, ఆ ఖర్చు ఆవిడ భరించలేదు. మొగుడు వదిలి పెట్టి పోయిన, ఆస్తితో, యేదో గుట్టుగా కాపురం చేస్తున్నది. ఆవిడను చూస్తే జాలి వేస్తుంది.' అంది రుక్మిణి.

'నువ్వు పిల్లల సంగతి చూసుకోగలననే నమ్మకం నీకు వుంటే, నాకేమి అభ్యంతరం లేదు' అన్నాడు కుమారస్వామి నవ్వుతూ.

మర్నాడు రంగమ్మ హైదరాబాద్ ప్రయాణం అవుతూ, తన పిల్లలు యిద్దరినీ రుక్మిణికి అప్ప చెప్పింది. రుక్మిణి మనస్సు ఆక్షణంలో యెంతగా ఆనందించిందో! తమ యింట్లో స్వర్గం వెల్లి విరిసి నట్లు భావించింది. ఆమె ముఖంలో నవ్వులు తాండ వించాయి. తమ ఏకాంత జీవితానికి స్వస్తిచెప్పి, నూతన జీవితం ప్రారంభించినట్లు మనస్సులో వూహాగానం చేసింది. కుమారస్వామి ధోరణిలో మాత్రం మార్పు యేమిలేదు. ఇది తాత్కాలిక ఆనందంగా భావించాడు. అందుకే భార్యతో

'నీకు ఈ పిల్లలను జాగ్రత్తగా చూడటంలో యేమయినా యిబ్బందులు వస్తే నేను చేయ కలి గింది యేమిలేదు గుర్తుంచుకో!' అన్నాడు నవ్వుతూ

'నాకు యెవరి సహాయమూ అక్కరలేదండీ! నేను ఈ పిల్లలను మేనేజ్ చేయగలను. నాకా నమ్మకం వుంది' అని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఆరోజు నుంచి రుక్మిణిలో చాలా మార్పు వచ్చింది. ఇంట్లో లడ్డులు, మిగతా స్వీట్లు తయారు చేయడం ప్రారంభించింది బిస్కట్లపేకెట్లు, చాక్లెట్లు కొని, పిల్లలకు అడిగినప్పుడల్లా పెట్టడానికి సిద్ధంగా వుంచింది. కూల్‌డ్రింక్సు కూడా తెచ్చి యింట్లో అట్టిపెట్టింది. పిల్లలకు బిస్కట్లు, చాక్లెట్లు పెట్టినప్పు డల్లా, కుమారస్వామికి కూడా పెడుతోంది. పిల్ల లను దగ్గరకు తీసుకుని, ముద్దుపెట్టు కుంటోంది. రోజూ వుదయం పెందలాడే లేచి, త్వరగా స్నానం చేసి, వంటచేసి, పిల్లలు స్కూలుకు వెళ్ళడానికి వీలుగా భోజనం పెట్టి, టిఫిన్‌బాక్సు యిచ్చి పంపు తున్నది. వాళ్ళ చేత స్నానంచేయించి, స్వయంగా డ్రస్ తొడుగు తున్నది. ఇద్దరూ చిన్న పిల్లలే! అయిదేళ్ళు, ఏడేళ్ళు వుంటాయి వాళ్ళకు.

రుక్మిణి పిల్లలు యిద్దరినీ స్కూలులో దిగ విడిచి వస్తోంది. అందులో ఆమెకు యెంతో ఆనం దంగా వుంది. చుట్టు పక్కల వాళ్ళంతా, ఆమె ప్రవర్తన గమనించి ఆశ్చర్యపోతున్నారు. ఎప్పుడు

దిగులుగా, మౌనంగా వుండే ఈమెలో యింత మార్పు యెలా వచ్చిందో అనుకున్నారు మనస్సులో.

సాయంత్రం స్కూలు నుంచి పిల్లలు రాగానే, వాళ్ళతో ఆమె ఆడుకునేది. పిల్లలకు కూడా బిడియం పోయి, 'కొత్త అమ్మ'తో కాలక్షేపం చేయడానికి అలవాటు పడ్డారు. ఆమె దగ్గరకు వచ్చి, ముద్దులు పెట్టి, స్కూలులో విశేషాలు చెపుతున్నారు. బిస్కట్లు, బిళ్ళలు తిని, దొడ్లో ఆడుకుంటున్నారు చక్కగా. అది చూచి రుక్మిణి ఆనందిస్తోంది. చీకటి పడ్డాక, పిల్లలని యింట్లోకి పిలిచి, వాళ్ళకు కథలు చెపుతోంది. తర్వాత వాళ్ళ హోమ్‌వర్క్ చేసుకో వడంలో సహాయపడుతోంది.

రాత్రి 8 గం॥ దాటాక పిల్లలు యిద్దరికీ భోజనం పెట్టి వాళ్ళను పడుకోపెట్టి, దంపతులు యిద్దరూ భోజనం చేస్తున్నారు. పిల్లలు రుక్మిణి చెప్పిన కథలు తలచుకుంటూ హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్నారు.

రుక్మిణి పిల్లలు అల్లరి చేస్తూ, యింట్లో తిరుగుతుంటే అది చూసి, భగవంతుడు తనకు సంతానం లేకుండా చేసి, తీరని అన్యాయం చేశాడని మనస్సులో బాధ పడుతున్నది. అయితే పైకి మాత్రం నవ్వుతూ కనిపిస్తూ, పిల్లల విషయంలో యెంతో శ్రద్ధ తీసుకుంటున్నది. కుమారస్వామి కూడా, తమకు సంతానం కలుగక పోవడం తీరని లోటుగా భావించి, మనస్సులోనే బాధపడుతున్నాడు. రంగమ్మగారి పిల్లలు, తమ యింట్లో వున్నంత కాలమే ఈ తాత్కాలిక ఆనందం! ఆ పైన మళ్ళీ తమ జీవితంలో శూన్యం!

పిల్లలు సాయంత్రం స్కూలునుంచి రాగానే, వాళ్ళు దొడ్లో ఆడుకుంటుంటే, కుమారస్వామి, రుక్మిణి చూసి ఆనందిస్తున్నారు అప్పుడప్పుడు ఆయన తను కూడా పిల్లల ఆటలలో పాలు పంచుకుని కాలక్షేపం చేస్తున్నాడు. వాళ్లు ఆడుకోవడానికి బొమ్మలు కొని తెచ్చి యింట్లో పెట్టాడు ఉదయం పిల్లలు స్నానం చేయడానికి నీళ్ళుతోడిపెట్టి రుక్మిణికి సహాయం చేస్తున్నాడు. ఇది గమనించి

'మీరు పిల్లల పెంపకంలో నాకేమి సహాయం చేయనన్నారు కదా! ఏమిటి! మీ ధోరణిలో మార్పు వచ్చింది' అంది రుక్మిణి నవ్వుతూ వాక

రోజులు గడిచి పోతున్నాయి. ఒక రోజు రంగమ్మ గారి వద్ద నుంచి వుత్తరం వచ్చింది. ఆరోగ్యం బాగు పడిందని, ఆ మర్నాడు తాను తిరిగి వస్తున్నానని ఆమె వ్రాసింది. అది చదువుకుని రుక్మిణి, రంగమ్మ గారి ఆరోగ్యం బాగుపడినందుకు సంతోషించింది కానీ, మర్నాడు పిల్లలు తమ యింట్లో నుంచి వెళ్ళిపోతారని బాధపడింది.

ఆరోజు సాయంత్రం పిల్లలు స్కూలు నుంచి రాగానే 'మీ అమ్మగారు రేపు పొద్దున వస్తున్నారు. ఆవిడ వస్తే, మీరు ఈ అమ్మను మరచిపోతారా!' అంది నవ్వుతూ.

'లేదు! ఎలా మరచిపోతాము!' అన్నారు పిల్లలు యిద్దరూ.

మర్నాడు రంగమ్మ గారు వచ్చింది పిల్లలు ఆమె రాగానే అమితానందంతో పరుగెత్తుకుంటూ, వీథిలోకి వెళ్ళారు. ఆమె చేతులుపుచ్చుకుని యింట్లోకి తీసుకు వచ్చారు

'మీ వంట్లో యిప్పుడు బాగా కులాసాగా వుందా!' అంది రుక్మిణి ఆప్యాయంగా పలుకరిస్తూ.

'భగవంతుడి దయ వలన నా ఆరోగ్యం బాగు పడింది. నా పిల్లలను కనిపెట్టి వుండి మీరు నాకెంతో సహాయం చేశారు. మీ రుణం నేను తీర్చుకోలేను' అంది రంగమ్మ.

'నేను చేసింది యేముంది? మీ పిల్లలు బుద్ధిమంతులు. రత్నాలు లాంటి వాళ్ళు' అంది కాఫీ యిస్తూ రుక్మిణి.

# రసవత్కవితల కడలి 'కొడాలి'

తిరునగరి శ్రీనివాస్

'చెప్పదగు కవిత రసము
ల్చిప్పిల, నప్పప్ప, బళిబళియన ; లేదా
యెప్పుడు చేయక యుండుట
యొప్పసుమీ! సుకవి ; యెంతయు
చితజ్ఞుడౌకో!'

అని మాదయగారి మల్లన ఏనాడో కవికోటికి అమూల్య సందేశ మిచ్చాడు. పదిమంది రసజ్ఞుల గుండెలను కరిగించే కవిత చెప్పమనీ, లేకుంటే- ఆ వ్యాసంగాన్నే మాను కొమ్మనీ ఆ పద్య సారాంశం. 'బండెడు చెత్తను-ఛందశ్చందముగా ప్రోగు చేసి స్వారస్యము చూడండని, మిడిసి పడే-వాళ్ళ కన్నా 'మంత్రంలా నాలుగు ముక్కలే ఉచ్చరించా డతను. బండ్ల కొద్దిగా చెత్తా చెదారం రాయలేదతను అనే కవీనాం కవిః కాళిదాసులా, వర్డ్సువర్తులా, రాబర్టు ఫ్రాస్ట్‌లా ప్రపంచంపై చిరంజీవియై వెలుగొందుతాడు. 'కళాజీవికి-వున్న విలువలు వేరు అతని అంతర్ దృష్టి ఎక్కడ అందంవున్నా అక్కడ-వాలుతుంది. దేని కోసమో తపన, అన్వేషణ నిరంతరం సాగిస్తాడు అందుకే అతని వూహాలు శాశ్వతమైనవి. అతని నీతి అతీతమైనది. అతని రచన అక్షమమైనది' అని కీ.శే. తిలక్ అన్నట్టుగానే వ్రాసిన కొద్ది కవితలలోనే సౌందర్యాలను కుప్పవోసి సాహితీ లోకంలో-తన రచన యొక్క అక్షయ ముద్రవేసిన కవి శ్రీ కొడాలి ఆంజనేయులు-గారు. ఆయన కవితా వ్యాసంగాన్ని అర్ధాంతరంలో వదులుకుని భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న దేశభక్తుడు. అక్కడా ఆ వాసనలు కోలుపోక 'జైలులో చందమామ'ను వర్ణించిన కళాజీవి. ఆయన కొంత కాలం కవిసామ్రాట్ విశ్వనాథతో కలిసి జంట కవిత్వం చెప్పారు. రసప్రపూర్ణములైన కొడాలి కవితా లోకంలోకి పరిశను కొంపోవడమే ప్రకృత ప్రయత్నం.

బుద్ధుని జీవిత చరిత్రకు సంబంధించిన కావ్యాలు భారతీయ భాషలలో ఇటీవలి కాలంలో అనేకంగా వెలువడినవి. స్వాతంత్ర్య సమర కాలంలో గాంధీజీ శాంతి సత్యాగ్రహం ఆయన బోధనలూ, బుద్ధుని సూక్తులనూ జాతికి మరల జ్ఞప్తికి తెచ్చాయి. ముఖ్యంగా హిందీ సాహిత్యంలో వెలువడిన 'సిద్ధార్థ' కావ్యం, ఎక్కువ ప్రచారాన్ని పొందింది. తెలుగు సాహిత్యంలో బుద్ధుని ప్రస్తావన దండిగా వుంది. తెలుగులో కవియైన ప్రతివాడూ బుద్ధుని గూర్చి పాటనో-పద్యమో వ్రాయకుండా ఉండలేదంటే సత్యదూరం కాదు. తిరుపతి వేంకట కవుల బుద్ధ చరిత్రము పింగళి కాటూరి,'సౌందర నందము', జంధ్యాల 'కరుణశ్రీ', వి.వి.ఎల్ నరసింహారావు 'ఆనందభిక్షువు' ఇలా అనేక కావ్యాలు సహస్రాధికంగా రచింపబడినవి. కొడాలి రచించిన 'సన్యాసి' ఈ శ్రేణిలో ఉదాత్త ఖండిక. సంసారం నుండి సన్యాసాశ్రమం స్వీకరించిన కరుణామయుని రూపాన్ని కవి మనోఫలకంపై

చిత్రించుకొని ఆయన కఠోర దీక్షకు సానుతాపాన్ని ప్రకటించడం దీనిలో అర్థవంతంగా ఉంది.

'మొగలి రేకుల మృదుల కపోల యుగము
కరకు యెండల వేడిమి కందువారె
తెలి మొగిలు చాటు నెలవంక తెరగుబూని
బూది బూసిన నీ మోము మురువు కరిగె'

అని ఉన్నె పూబోణుల గాఢాశ్లేషములలో కరిగిపోయే స్వామి శరీరం కఠిన హృదయాలే ద్రవించే విధంగా కటిక రాతినేలలో గడుములు కట్టిన దేమిటని.

"దివ్యకుసుమాంగి యీనెలు దీసి యిచ్చు
లేదమలపాకు మడుపులు కాదటంచు
హరిణ శాబమ్ములకు తృణాంకురములిడగ
మనసు పుట్టెనె? ఎంత యమాయికుడవు?"

అంటూ ఐహిక సుఖాలను వదలి ఆధ్యాత్మికాన్వేషణకు పూనుకున్న సన్యాసిని కవి ప్రశ్నించడం హృదయ ద్రావకంగా ఉంది. ఆ ప్రభువు 'మధురదరహాస చంద్రికా సుధ తొరంగు కామినీ స్నిగ్ధ గండ భాగమ్ములానుకప్పురపు కమ్మతావుల కావి మోవిని బిటుపడజేసి కొన్నవాడట! అల్లనల్లన దరిజేరి, అలఁతిసిగ్గు జాలిచూపుల క్రేగంట మేళవించి మధురమంద స్వనంబుల మాటలాడు ప్రణయిని బాంధవమును బాసినవాడట! ప్రణయం కోసం సర్వస్వాన్ని త్యజించడం చూచాము కాని అంతకన్నా ఉన్నతమైన పరమార్థసాధన కోసం దీర్ఘ నిశీథ సమయాలలో స్వామి మహాభినిష్క్రమణం చేయడం కవికేకాదు మనందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. ప్రియినెడబాసి వైరాగ్యంతో కాలి పుట్టాన్ని కటి సీమ కట్టి నిలుచున్న విరాగి కవి మాటలు విని కలకలనవ్వాడు. ఆ నవ్వే స్వామితో

"నవ్వెదవదేం? నామాట నమ్మి, నీదు
నెలతకడ కేగి తప్పు మన్నింపు మనుము
కరకు రుద్రాక్షమాలల కంఠసీమ
కమ్మ సంపగి దండలు గౌగిలింప"

అని కవి విన్నవించుకోవడం విచిత్రంగా ఉన్నా అప్పటి గౌతముని తప్తమూర్తిని మనో నేత్రంతో కాంచిన కవి, హృదయం ద్రుతియై పారడం వలన ఆ వేడికోలు చేయక తప్పలేదు మరి. ఈ కవితలో కొడాలి వాడిన పదాలు సుతిమెత్తగా ఉండి కరుణామయుని వర్ణనలో కరుణను చిప్పిల్లజేసినవి. మాటలతో అందమైన బొమ్మలు చెక్కడం 'సన్యాసి'లో ప్రతిపద్యంలో కన్పిస్తుంది.

"జాజిపూసౌరభమ్ములు జల్లు విరియు జవ్వనము
మధుర దరహాస చంద్రికాసుధ వంటి కమ్మని

పదాల పోహళింపు కొడాలి కవితకు రంగు వేసి కళామోహనంగా పఠితకు కొన్ని సౌందర్యాలు చూపిస్తాయి.

కొడాలి కవితలలో ఆయనకు పేరు తెచ్చిపెట్టినది "పెండ్లికూతురు". తెలుగు వధువును కన్నులకు కట్టినట్లుగా ఆయన వర్ణించారు ఆమె పోకడల ఒయ్యారాలన్నీ మన కెదుట కన్పించి తేలూపిస్తాయి. పెండ్లికూతురు వీక్షణాన్ని, నిరీక్షణాన్ని వివాహశోభనూ ఆ వైభోగాన్ని, కేవలం ఐదు పద్యాలలో అపూర్వ కావ్యసృష్టి. విశాల భావాలను చిన్నపదాలలో అందంగా పొదగడం ఒక్క ఋషివంటి కవే చేయగలడు.

"కనుగవ దల్లి గారిడిన కాటుకరేఖల ప్రేమ
వల్లికల్
బెర చిత్రపాప్రసూన మదులేశములన్ మిళి
తంబులైన, వీ
క్షణముల నిన్నొరుల్ గనని చందమునన్
వరుగాంచునీకు యా

వన మధుమాస యామినులు ప్రాప్తము
అయ్యెడుగాక శీఘ్రమే!"

ఈ పద్యంలో ఎంత తెలుగుదనం! తల్లి గారిడిన కాటుకరేఖలూ వీక్షణాలూ ఆ వధువు ఇతరులు చూడకుండా వరుని చూడడం వంటి అందాల బొమ్మలు సృష్టించడం కొడాలి సొత్తు. ఆమెకు 'యౌవనమధుమాస యామినులు ప్రాప్తము అయ్యెడుగాక' అని కవి ఆశీర్వాదం. తలుపు దగ్గర ఆమె వయస్సులోని బాలికలూ—పెద్ద ముత్తైదువులూ భర్త పేరడగడం తెలుగు పెండ్లిండ్లలో నేటికీ అనుస్యూతంగా వస్తున్న ఆచారం. అలా అడిగితే ఆ ముగ్ధ వధువు తీగ యెలుగుతో 'వంతు మన పెండ్లి కుమారునిది' అన్న అమె లజ్జాదర హాస చంద్రికలు శాశ్వతంగా వెదజల్లబడాలని కవి ఆకాంక్ష.

ఈ క్రింది పద్యంలో వివాహదృశ్యం ఎంతో సహజంగా వర్ణించబడింది.

పగడపు మోవి కెంపులకు బైపయిదాగుడు మూత
లాడు లే
నగవు గులాబి పూసరమునన్ విరిమల్లెలు
దాపినట్లు దో
పగ బతి యుత్తరీయ మధుపర్కము గేల
గ్రహించి, వెంట జం
టగ జను నమ్ర భావముల నారతమున్ నిను
బాయకుండుతన్!

ఆ వధువు పయట కొంగు పునుగు జవాది తావులుగు బుల్కొను నట్టిది. ఆ కొంగునకు మగని కొంగు ముడివేసికొన్నది. అప్పుడు వదినలు 'నీ మగడింక నెట్లు చెప్పిన నటులే వినంగలడు. పెండ్లము గీచిన గీత దాటడు' అని అప్పుడే పరిహాసాలు ప్రారంభించారు. ఏమి చేస్తుంది ఆ ముగ్ధ! చురుకు చూపులతో చూడడం తప్ప!

ఆమె
'వేసంగి సందెల విరిమల్లె పూలు
పరచిన ముత్యాల పాలకీలోన'
—ఊరేగిన నాటి—
మధుర దృశ్యాన్ని
'చుక్కల రథములో నెక్కి వేంచేయు
ఒక చందమామ మాకున్నంత వరకు'

మరచిపోలే మంటాడు కవి. ఇప్పుడు చెప్పండి. ఈ కవితలో ఎన్నెన్ని అందాలు, ఎన్నెన్ని దృశ్యాలు, ఎన్నెన్ని బాసలు, ఎన్నెన్ని నవ్వులు! కాళహస్తీశ్వర మహాత్మ్యం రాయకున్నా ధూర్జటి శతకం తోడనే మహాకవిగా నిలబడగలిగినట్లుగా ఏ మహాగ్రంథం రాసినా-రాయకున్నా కొడాలి "పెండ్లి కూతురు"లో నిస్సందేహంగా మహాకవి అయ్యారు.

కొడాలి 'దెబ్బతిన్న లేడి' చదివినప్పుడు ధర్మదేవతను నొప్పించిన కలిపురుషుని నిందించిన పరీక్షిత్తు పలికిన 'వాచవియైన గడ్డితిని వాహిను లందు జలంబు ద్రావగా' అన్న భాగవతపద్యం జ్ఞప్తికి వస్తుంది.

తనను కొట్టిన బోయవానిని లేడి కన్నీళ్లతో మందలించడం కావ్యవిషయం.

'ఆయటవీస్థలిన్ ననుదృణాంకురముల్దిని
కొండవాగులన్
దీయని నీరుగ్రోలి పువుతీగల నీడల విశ్ర
మించు నే
నే యపకారి నైతినని యీ నిశితాంబక
మేసినావు మీ
బోయల కేగతిన్ దెలియ బోలుగు మామక
సౌకుమార్యముల్'

అంటూ కిరాతుని నేయియు, పాయసమ్ము దిననేర్చిన పెద్దల పాదసేవలను చేయమంటున్నది

లేడి. అప్పుడు వాని చెట్టతనం మానుతుందట! రక్తంత్రాగి, మాంసం మెక్కే వాళ్ళ హృదయాలు కిరాతకాలు, ఆశ్రేణినుంచి బయల్పడి నేయి వంటి, పాయసం వంటి మెత్తని మనస్సున్న వారి పాద సేవ చేసినప్పుడే వానిలో పరివర్తనం వస్తుందని కవి వచస్సులోని భావం. ఆ మృగం—

'స్వర్గీయలతానికుంజముల కిన్నెరసానులు
బోవుదారులన్
బోయెదనింక నాకు సెలవు దయసేయు,
కృధన్ ద్యజింపుమీ'

అని తన గుండెలో శరాన్ని నాటిన బోయనే అడగడంలో కవి ఆశించిన ప్రయోజనం పరిణామం ఆమాటల వెనకనే స్పష్టంగా కన్పిస్తుంది కదా! తమ నెచ్చెలి లేడి రాలేదని తపస్వి కన్యలు వియోగం తాళలేక ఎదురుతెన్నులు చూస్తారు కాబట్టి బొయెతతో పోయి వేగంగా వారిని కంట తడి పెట్టవద్దని ఊరడించమంటుంది కురంగి.

'పేరిమి బూలు వెట్టి తినిపించి మరందము
వోసి సంజలన్
జేరువదీసి యరచేతుల బెంచిన తాపసాంగనల్
లేరిట నాదు పాపము ఫలించిన యీ యవ
సానపున్ సమా
చారము నంత్య భాష్పకణజాలము తో నయి
నన్ వచింపగన్'

అంటూ తన దీనావస్థను కిరాతుని ముందు దుఃఖంగా కుమ్మరించింది కురంగి. రసార్ద్రమైన కొడాలి కయితల జాలుపొంగిన ఈ నాలుగు పద్యాలు నాలుగు శోకసముద్రాలు.

కొడాలి 'రాధ' విరహోత్కంఠిత. ఎల జవ్వనాన్ని నల్లని వాని కప్పన గావించిన సుకు మారి. ఆమె మాసిన చీరతో పొగడ మ్రాకుల రెమ్మల నీడలలో దీర్ఘంగా నిశ్వసించుతున్నది. చెలికోసి తెచ్చిన దోసెడు మొల్ల మొగ్గలను దళ మ్మలుగా కుప్పపెడుతున్నది. ఆమెను

'ఈ సుకుమారపున్నిశల కృష్ణుడొసంగిన
పుష్పరాగ పుం
బూసల దండ రాపుడుల పూనుకు చాగ
ములుష్ణభాష్పపున్
రాసులకందు వారెడు విరాగమదేటికి? నిండు
ప్రాయపున్
మోసుల వేళ నిట్టి యిడుముల్ వడనిన్ను
విరించి చేసెనే!'

అని అశ్వాసిస్తున్నాడు కొడాలి.

రాధను రమ్మని మోసంచేసి తానెక్కడికో పోయిన మాధవుని గూర్చి వలపంత పడుతూ పుష్ప వన వీథులలో వెదుకడమెందుకు? ఈ వేసంగి పూల వెన్నెలలూ-పికాంగ నాభ్యాసితరాగమూ ప్రణయానికి పాత్రమైనవి కావా? అవి మరీ ఆమెను కవి ఉడికిం చడం రాధ విరహాన్ని, ఇమ్మడింపజేసే విధంగా ఉంది. ఇంకా

'చెల్లరె యీ మధూపవన సీమల నావులగాచు
వానికై
పల్లెల నుండి నాగరిక పద్ధతులేమి యెరుంగ
నట్టి యా
గొల్లపడంతు లెల్లరును కోరిన కోరిరి గాక,
నీవు నా
నల్లని వానినే వలచి నావట యెంతటి సిగ్గు
చేటొకో'

అనడం బట్టి కొడాలి 'రాధ' ఎంత నాగరక స్త్రీయో, ఆమె కృష్ణమూర్తి కోసం ఎన్ని సింగా రాలు చేసికొని వచ్చిందో! అవన్నీ వేసంగి పూల వెన్నెలలో నిష్ఫలం కావడం బాధాకరం కాదా! అందుకేనేమో కవి రాధిక పక్షావలంబియై ఆవుల గాచు వానిని నాగరక పద్ధతులెరుంగని గొల్ల

పడతులు కోరినా కోరిరి. కాని ఆ నల్లని వాణ్ణి నీవూ వలవడం సిగ్గుచేటు కదా! అనేంత వరకూ అందంగా వెళ్ళాడు. తెలుగు కవితా లోకంలో ఎందరో 'రాధ'ను వర్ణించారు. కాని కొడాలి, వేదుల 'రాధ'లే రసజ్ఞుల హృదయ పీఠాలకెక్కిన పూబోణులు

కొడాలి దేశభక్తికి ప్రతీక, ఆయన కీర్తికి పతాకమైనది 'జైలులో చందమామ' అనే కవిత. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు. జైలులో నిర్బంధింపబడిన కాలంలో వెలువడిన కవిత ఇది. కృష్ణపక్షం చెరసాల గవాక్షంలోంచి తొంగి చూచే టప్పుడు—చింతలలో చిక్కి శల్యా వశిష్టమైన మృగాక్షిలా కన్పించిందట! మళ్ళీ వస్తున్నది శుక్ల పక్షం.

'రాతిగుండెలు గలిగిన రాచభటుల
కర్కశాఘాతముల మేను కందిపోయె
శీతల హిమంబు కణముల చిల్కరించు
అమృత కిరణాల స్పృశియింపుమయ్యమమ్మ'

అని కృశించిన 'మే'కి సంధ్యాపవనాలు సోకక చాలానాళ్ళు గడిచిందనీ జ్యోత్స్నా ప్రసాద శీకర పరంపరాభిషేకమ్ము చేయింపుమనీ చెరలో నుండి చంద్రునకు కవి ప్రార్థన.

ఇనుప తలుపుల నడుమ వసించే బంధితుల ఉల్లాలకు తెల్లమబ్బుల కెరటాలపై తేలిపోయే చంద్రుని అంతరిక్ష యానం ఉల్లాస పరుస్తుందట!

'సర్వతారాపథమ్ముల నడచునిన్ను
నే కిరీటాధిపతులు బంధింపగలరు
కష్టతర దీర్ఘ యామినుల్ గడచివేగ
బంధన విముక్తులను జేయ వలయుమమ్ము'

అని

'బంధనాలయ బాహ్య ప్రపంచ వార్త
లితరములు రాకున్ననేమి! సురవ
ధూ కపోల కర్పూర మధుర పరిమళ
పులకిత రహస్యముల నెల్ల దెలపిపొమ్ము'

అని ముడుచుకొన్న కలువపూవుల దళాలు చంద్రకిరణ స్పర్శతో నవ్వినట్లు ఏనాడో మూగ వడిన తన హృదయవీణ చంద్రాగమంతో మరల మ్రోగిందనీ, సముద్రుణ్ణి ఆనందంలో బోర్లపడజేసే చంద్రుడేడ?

స్వాదు భోజ్యము లేని
నోచుకోని బంధితుని సంతోష మేది?

కాబట్టి అంతటి మహనీయ మూర్తికి లోకంలో ప్రతివాడూ నూలుపోగు అర్పించి తుష్టి పొందితే తాను హర్షముక్తాశ్రుల సువర్ణహారములను గూర్చి అర్పించుకున్నానని ఆనందించాడు కవి. ఈ కవితలో జైలు జీవితం పరోక్షంగా వర్ణింపడడం విశేషం. ఇట్లాంటివే కొడాలి కవితలన్నీ! 'తామ్ర పరిణలో ఆనాడు దొరికినవీ, ఈనాడు దొరికినవీ ముత్యాలే' అని మమ్మటుడు అన్నట్లుగా కొడాలి కవితలన్నిటా ఆయన శైలి, రమ్యత కన్పిస్తూనే వుంటుంది. ఈ నాడు గావుకేకలే కవితలుగా చెలామణి అవుతున్న కాలంలో భావపుష్టి-రసపుష్టి గల కవితల పునః పఠనం అత్యవసరం. రుజాగ్రస్తమైన మనస్సులకు ఆరోగ్యం ప్రసాదించే ఔషధాలు ఆ రసవత్కవితలు ఆ కవితాస్వాదన ఆధునిక సాహితీ సృజన చేసే వాళ్ళకూ-సారస్వతాభి లాషులకూ అతిముఖ్యం. ఈ వ్యాసం ఏ ఒక్కరినైనా ఆ వైపుకు మళ్ళిస్తే..ఆశించిన ప్రయోజనం చేకూరినట్లే.

'సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సల్లాప స్సుజ్జ
నై స్సహ'

# ధూర్జటి వ్యక్తిత్వం-నవ్య కవిత్వ తత్వం

మల్లంపల్లి విజయకుమార్

తెలుగు నేలలో 15వ శతాబ్దంలో శైవ వైష్ణవ మత భేదాలు ప్రజ్వరిల్లాయి. తెలుగు సాహిత్య రాజకీయ మత ఆర్థిక భౌగోళిక పరిస్థితుల నేపథ్యంలో ఆయా మతాలు తమ అస్తిత్వాన్ని నిరూపించుకొన్నాయి. ఇట్టిచో మత కవుల రచనల ప్రభావం నాటి సమాజానికి ఎంత వరకు స్ఫూర్తినిచ్చాయని ప్రశ్నించడం కన్నా, వారి రచనలకు సాంఘిక వాతావరణ నేపథ్యం ఎలాంటిదని ప్రశ్నించడమే ఉత్తమ విధాయకమౌతుంది అప్పుడే సార స్వత ప్రయోజనమనే ఉన్నత భావాన్ని ప్రశ్నించి తెలుసుకోగల వివేక చిత్తులవుతామనడం సామంజస్య మౌతుంది. ప్రత్యేకించి శివకవియైన ధూర్జటి వ్రాసిన కాళహస్తీశ్వర శతక మాధారంగా ఆనాటిసమకాలీన సమాజ పరిస్థితులు రచనలో ఎలా పెనవేసు కొన్నాయో, గమనించడమే కాక, ధూర్జటి వ్యక్తిత్వం. ముఖ్యంగా ఆయన శతకరచనలో దాగిన నవ్యకవిత్వ తత్వం మొదలైన అంశాలను పరిశీలించడమే ఈ వ్యాస ముఖ్యోద్దేశం

ధూర్జటి శివసేవా ధురంధరుడు. కవిత్వ అభినవేశంలో రాజులలోని అవగుణాల్ని సైతం ధిక్కరించగల ఆత్మవివేచన, ఈశ్వరజ్ఞానం ద్వారా పొందగలిగాడు. అందుకే వీలైనంత వరకు ధ్వనిగా కాక వాచ్యంగానే రాజుల్ని సైతం విమర్శిస్తూ తనకు తోచిన మంచి అభిప్రాయాల్ని నిర్ధారిస్తాడు. మచ్చుకి—

'కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై' అను ఈ పద్యంలో ధూర్జటిలో అభ్యుదయ తత్వం కనిపిస్తుంది. జీవన భ్రాంతితో ప్రజలు ఎదురుచూసే పుత్రోత్సాహం తన దృష్టిలో అన్యాయ మనిపించింది. అందుకే నూర్గురు పుత్రులున్న ధృతరాష్ట్రునికన్నా అపుత్రకుడైన శుక మహర్షియే ఉత్తమస్థానం పొందాడని విశదీకరిస్తాడు. దీన్నే యీనాటి సమాజపరంగా మలచుకొని ఆలోచిస్తే పురుషుడికెంతో స్త్రీకంతే సమానత్వం ఉండి తీరాలన్న ఆదర్శభావనగా విస్తృతీకరించవచ్చు.

'నా స్పృశః కురుతే కావ్యం' అన్నది ఆర్యోక్తి మరి ధూర్జటి తను పొందిన ఆవేశం ఆవేదన మొదలైన ప్రతిఘటనాత్మక ధోరణుల్ని ఎలా ఋషిత్వంవైపు మరల్చుకొన్నాడన్నది వింతప్రశ్నగా తోస్తుంది. నిజానికి ధూర్జటి వ్యక్తిత్వాన్ని మార్చింది 'శివభక్తి తత్పరత'. అప్పటికే రాజులుచేసే దురన్యాయాల్ని ప్రతిఘటిస్తూ, రాజుల్ని అడ్డుపెట్టుకొని అక్రమాలకు పాల్పడే రాజోద్యోగుల్ని, ఇతర వర్గాల వారిని నిరసించిన ధూర్జటికి తన బాధను ఎవరికి మొరపెట్టుకోవాలో అర్థం కాలేదు. 'నా విష్ణుః పృథివీపతిః' అన్న సూక్తి ప్రకారం తన ఎదుట రాజే విష్ణువంతటి వాడైనా, చేసే పనులు దుష్టంగా తోచాయి. అందుకే 'విష్ణు రూపాయ శివయే' అన్న వాక్యంలో శివుడినే తన

మనోభిరాముడిగా తలచాడు. తనలో ఊపిరి పోసుకున్న కవిత్వాన్ని భక్తిమార్గాన వెన్నెల కురిపించాడు. కనుకనే 'రాజుల్ మత్తులు వారిసేవ నరక ప్రాయంబు' అంటూ కవిత్వంలో నిరసనత్వాన్ని ధీమాగా ప్రదర్శిస్తాడు.

నిజానికప్పటి కాలపరిస్థితుల్లోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యత్యాసాలే శతకకవులలో తీవ్ర అసంతృప్తిని కలిగించినవి. చాలామంది కవులు అప్పటి సమకాలీన సమాజంతో విసిగిపోయి నిరాశా నిస్పృహలకు లోనై విరక్తి చెంది దేవుడనే భావనలో శాంతిని, తృప్తిని వెతుక్కొనే ప్రయత్నం చేశారు. ఆ భక్తి తాదాత్మ్యంలో తమలో ఉన్న ప్రతిఘటనాత్మక వైఖరుల్ని ఆత్మాశ్రయ కవిత్వం ధోరణిలో దైవంపేరిట శతకాలుగా అల్లారు. అందునా ధూర్జటి సకల శాస్త్రాల్ని మథించిన దాంతుడు. కాని అందులో ఏ ఒక్క శాస్త్రం కూడా తన మనోవైకల్యానికి కారణాన్ని గుర్తింపలేక పోయింది. ఆ చిత్తసంక్షోభంతో తను నేర్చిన చదువులు జ్ఞానాన్వేషణను సత్యశోధనను గుర్తించలేవని అంటూ,

'ఏవేదంబు పఠించె లూత భుజగంబే శాస్త్ర
ములు్చదె తా
నే విద్యాభ్యాసం బొనర్చెగరి, చెంచేమంత్ర
మూహించె, బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా కావు'

అని ఆశాపాశ నిబద్ధమైన లౌకిక జీవితాన్ని త్యజించి 'విశ్వధాభిజ్ఞత'ను ప్రకటించాడు.

పైగా ఒకవేపు ఆర్థిక భావం, మరోవేపు సమాజపు మనుగడ, ఈ రెంటి మధ్యనున్న సంధిగ్ధావస్థను తీర్చే 'దైవచింతన'యే తన శరీరాత్మకు సరియైన కాయ కల్ప చికిత్సగా భావించాడు.

దీనే

'అంతా సంశయమే శరీర ఘటనంబంతా
విచారంబె లో
నంతా దుఃఖ పరంపరా న్వితమె. మేనంతా
భయభ్రాంతమే
యంతానంత శరీర శోషణమె దుర్వ్యా
పారయె దేహికిన్'

అని తన తనూ విలాస విభవం, మనోదీప్తి మృగ్యమేనని తలుస్తూ ఆత్మ సాక్షాత్కారం పొందాడు. సిద్ధార్థుడు బుద్ధుడైనట్లుగా ధూర్జటి ఆత్మ పురి విప్పింది. సమస్యలు, కలతలు, వ్యసనాలు యివన్నీ మనిషి సృష్టించుకొన్న జీవన భ్రాంతులుగా తలపోసాడు, ఆ చైతన్యత్వంతోనే మనిషికి తిర్యక్కులకు భేదం లేని 'భక్తి భావాన్ని' పేర్కొంటూ 'పరమార్థంబిచ్చి పొమ్మన్న, నీ శ్రీ భండారములో గొఅంతపడునా శ్రీకాళహస్తీశ్వరా' అని కుల మత జాతి భేదంలేని భక్తులు నానా విధాలుగా సేవిస్తుంటే నీవు వారి కోర్కెలు తీర్చక లోభం చూపిస్తా వేమిటని సూటిగా ప్రశ్నిస్తాడు.

లోకంలో ఒకడు ఒక విధంగా తన్ని మోసగించాడని తెలుసుకొన్నపుడు తాను కూడా అతన్ని ఎలాగైనా దెబ్బ తీయాలని ఎదురు చూస్తుంటాడనడం సహజం. బహుశా ఈ కవి జీవితంలో అలాంటి సంఘటనే జరిగి ఉంటుంది కాబోల్ను. కనుకనే ఈ జ్ఞాతుల బాధ పడలేకపోతున్నానని, అట్లని ప్రతిక్రియ చేయడానికి దోషిగా మారలేక పోతునానని అంటూ 'యతినై పోగోరినన్ సర్వదా చేత క్రోధము మానదెట్లు నడతున్ శ్రీకాళహస్తీశ్వరా' అని అంటాడు.

కాని లోకమంతా యిలా ప్రతిఘటనాత్మక వైఖరులకు వేసారి యతులుగా మారితే జనుల మతులు వైరాగ్యానికే అంటుకుపోతే యిక సృష్టి జీవన సారమెట్లు ఫలవంత మౌతుంది? మరి ధూర్జ

పేర్కొన్న 'యతి మార్గం' యొక్క ప్రయోజనం ఏమిటి? అన్నది వితర్కిస్తే 'ఇంద్రియ నిగ్రహమే' అన్నిటా పరిష్కార మార్గంగా కనిపిస్తుంది మార్క్సిం గోర్కీ అన్నట్లు—

'మనిషి పక్షిలా ఎగరగలుగుతున్నాడు
చేపలా ఈదగలుగుతున్నాడు
కాని మనిషిలా నడవలేక పోతున్నాడు'

అంటూ ఈ విశేష వాక్యాల్ని వివేచనాత్మక ధోరణిలో మన కందించాడు. నిజమే మనుషుల్లో సమత నశించినపుడు యిలాంటి భావ ధోరణులనే ఆశ్రయించాల్సి వస్తుంది తత్ఫలితంగా మనిషిగా ఆలోచించమనే వైయుక్తికానికి తీసుకుపోవడం జరుగుతుంది. పై చెప్పబడిన వాక్యాల్లోను కనిపించే ఆశయం ఈనాడే కాదు ఆనాటి సామాజిక కవులు కూడా తమ కవితలలో వెలయించారు అయితే దీన్ని సమకాలీకులు గ్రహించే స్థితిలో ఉన్నారో లేరో, ఇంతకి ధూర్జటి పేర్కొన్న 'యతిమార్గం' వికలమౌతున్న మనస్సుకు నిష్ఠతో కొంత సంయమనం పాటించే 'ఆత్మ విద్య' లాంటిది. దీనివల్ల మనస్సు అర్థం వల్ల, కామం వల్ల మరే యితర ప్రలోభాలలో పడకుండా బుద్ధిని నిలకడగా సత్ ప్రవర్తనా మార్గంలోకి తీసుకు వెళుతుంది. ఇదియే ధూర్జటి ఆశయం. ఈ ఆశయాన్నే యింకా విశ్లేషిస్తూ-

'రోసిందేటిది రోత లేటిది మనో రోగస్థుడై, దేహితా
పూసిందేటిది పూత లేటివి మదాపూతంబు లీ దేహంబుల్
మూసిందేటిది మూతలేటివి సదా మూఢత్వమే కాని తా
చేసిందేటిది చేతలేటివి వృథా శ్రీ కాళహస్తీశ్వరా!'

అని ధూర్జటి యతిమార్గాన్ని పాటించి కూడా మనోరోగంతో, మదంతో, మూఢత్వంతో క్రుంగిపోయే యతీశ్వరుల్ని చూపుతూ, ఆలోచనల్ని చేతలతో సమన్వయించుకోమని హెచ్చరిస్తాడు. అంతే కాని భవబంధాన్ని పూర్తిగా త్రెంపి వేషభాషల్ని మార్చి సన్యాసి మార్గంలో దిగమనే విన్నపం కాదు. ఇదియే ధూర్జటి పేర్కొన్న మానసిక యతిమార్గం.

వేమనకు రోత కల్గించిన 'వేశ్యా వ్యసనం' ధూర్జటికి కూడా విపత్కర స్థితిని తెచ్చి పెట్టిందేమో. పైగా ఈ శతక రచనా కాలాన్ని చూస్తే ధూర్జటి తన అంత్యకాలంలో వ్రాసి యుండవచ్చుననడం సర్వ విదితం, కనుకనే ఆంధ్ర భోజుడైన శ్రీకృష్ణ దేవ రాయల పాలన అంతరించిన రోజులలో రాజ్యం అంతర్గత కల్లోలితమై చిన్న చిన్న పాలకులచే ఆంధ్రావని ముష్కరుల పాలైనట్లు ద్యోతక మవుతుంది. ఈ నేపథ్యంలో సమాజంలో జరిగిన అవినీతి, విచ్చలవిడి శృంగారం జాతిని అధః స్థితికి తీసుకు వెళుతుందని ధూర్జటి గుర్తించాడు. అందుకై వేశ్యా నిర్మూలనాన్ని అంతర్గతంగా శతకంలో పేర్కొంటూ, పుష్పించే పువ్వుల్ని, ఫలించే ఫలాల్ని మదన వికారాలకి సంకేతాలుగా నిర్దేశిస్తూ-

'పువ్వులు పండ్లు మన్మథ ముఖావిర్భూత దోషంబులు' అని శివపూజకై వాటిని నిషేదించుకొంటూ ఒక్క బిల్వపత్రాన్నే శివార్పణం చేయమన్నాడు.

పైగా అప్పటికే ప్రబంధ కావ్యాలు శృంగార రస నిలయాలుగా పేరెన్నిక గనడంతో ప్రబంధ కవిని, ఛీ-ఛీ-పృష్టాగత భాంథవంబు నిజమా!' అని హేళనచేసి భక్తి శతకకావ్యాలే సమాజ శ్రేయస్సుకు ఉన్నత సోపానాలని ధూర్జటి పేర్కొంటాడు. తను ఉన్న వాతావరణంలో ముచ్చులు, దుష్టులు తమ తమ పనుల్ని యథావిధిగా అజ్ఞయంగా నిర్వర్తిస్తుంటే నీషాలోచనం, శూలం

మిన్నక ఉండినాయే? బహుశా వారు నీకేం ఉపకారం చేశారని 'దుష్టశిక్షణ'కు ఉద్యమించక 'లంచావతారమూర్తి'గా మాహవని నిగర్విగా మహేశ్వరుణ్ణి ప్రశ్నిస్తాడు ధూర్జటి.

ధనమదం ఉన్న రాజుల్ని, ధనలోభంతో వేలాడే ధనవంతుల్ని ధనాశతో వేగిపోయే మధ్యస్త జీవుల్ని, పండితుల్ని, కవుల్ని అజ్ఞాన లక్ష్మీ దారిద్ర్యుల్నిగా లెక్కించి, 'అర్థమే జీవితానికి పరమార్థం కాదని, ధర్మమే జీవితార్థ సాధనమని ధూర్జటి ఉపదేశిస్తాడు.

ఇలా ధూర్జటి శతకకావ్యాన్ని పరిశీలిస్తే అభ్యుదయ భావధోరణులతో కూడిన నవ్య కవిత్వ తత్వం గోచరిస్తుంది. ఆయన చెప్పిన ఆత్మాశ్రయ పద్ధతిని పరిశీలిస్తే కొంతలో కొంత 'కాల్పనిక స్వభావం' గోచరిస్తుంది.

ఇంతకీ కాల్పనిక లక్షణాల్ని సమీక్షిస్తే ఆత్మీయత, ప్రకృతిని జడ ప్రకృతిగా కాకుండా ఆత్మాశ్రయత్వంతో వర్ణించడం, భావోద్వేగం, కరుణరసం లేక విప్రలంభ శృంగారం అనేవి ముఖ్యమైనవి.

ధూర్జటి కవిత్వంలో పై లక్షణాల్ని ఆపాదించి చూస్తే, ఇహలోకపు ఉనికిలేని దేవుణ్ని జడ ప్రకృతిగా కాక ఆత్మాశ్రయత్వంతో వర్ణించడం, వైరాగ్య ప్రబోధంతో కరుణరసాన్ని జిప్పిల జేయడమే కాక, శతకాసాంతం యీకవి తననో పాపిగా కాముకునిగా మారినందుకు పరివేదన చెందే పశ్చాత్తప్త హృదయుణ్నిగా కాల్పనికత స్వభావాల్ని ప్రదర్శిస్తాడు. పైగా ప్రకృతిలోని జడవస్తువులో కూడా చైతన్యాన్ని చూడగల తిన్నడు పాత్ర వంటి మనస్తత్వం గల యీ కవి హృదిలోని భావోద్వేగమే శతక రచనను ఆపాత మధురంగా ఆలోచనామృతంగా నడిపించింది. కాల్పనికతకు సరియైన అర్థాన్ని వివరిస్తూ శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు,

'కాల్పనికత అంటే వాస్తవ వ్యతిరిక్తమైన శుద్ధ కల్పనాప్రపంచాన్ని అక్షరాల్లోకి కుదించడం కాదు, కవిశ్రోతా పరస్పరం ఎదురైనంతగా స్పందించడం. భావానుభవాన్ని సమంగా పంచుకోవడం' అని పేర్కొన్నారు. ఈ భావానుభవాన్నే సమంగా పంచుకొనే ధోరణి ఆత్మాశ్రయ పద్ధతిలోనే సులభమౌతుంది. దీనివల్ల కవి పాఠకునిలో అంతర్గత చైతన్యం కల్గిస్తాడు. కావ్య సందేశం ద్వారా లేదా శతకంలో పేర్కొనే తాత్వికచింతనలో తన అనుభవాన్ని జోడించి సద్పథంలోకి పాఠకుణ్ని తీసుకువెళతాడు.

ధూర్జటి కాళహస్తి శతకం కూడా యిట్టి ముక్తి మార్గానికి చేరుకొంది, అందుకే ఈశతకం ప్రాచీనమైన ధూర్జటిచెప్పే ఆత్మానుభూతి సందేశం నవ్యాతినవ్యం. ఇందుకే స్తుతమతియైన ఈ ఆంధ్ర కవి కావ్యరస మాధురీ మహిమ 'నవ్యభాషా శత ధానిగుంభన రసస్థితి'గా కన్పిస్తుంది. మొత్తానికి ధూర్జటి కాళహస్తీశ్వర శతకం, ప్రాచీన ఆధునిక శతక వాఙ్మయంలో మేలిమి కలదియై 'బహుజన హితాయ బహుజన సుఖాయ' అనే సూక్తికి సార్థక్యం కావించుకొందనుట స్పష్టం.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర,

## కార్యవర్గ సభ్యులు

శ్రీ బోయపాటి నాగేశ్వరరావు
**అధ్యక్షులు**
తెనాలి

శ్రీమతి యం. వేదవల్లి
ఉపాధ్యక్షురాలు
విశాఖపట్టణం

చవాకుల నరసింహామూ రి
ౖలు
హైదరాబాదు

శ్రీ పిన్నమనేని ప్రసాదరావు
కార్యదర్శి

కాజ వెంకటేశ్వరరావు
కార్యవర్గ సభ్యులు
గన్నవరం

శ్రీ ఈమని దయానంద
కార్యవర్గ సభ్యులు
ఒంగోలు



పి. వెంకట రామారావు
కరీంనగర్



శ్రీ చేకూరి కాశయ్య
కొత్తగూడెం



శ్రీ బోడి అంజయ్య
పొన్నూరు



గోదా తిరుమలయ్య
హైదరాబాదు



సి.హెచ్. కుసుమ హరనాథ శర్మ
గుంటూరు



ఎం.పి. మోహన్
మదనపల్లి



మక్కపాటి వెంకటరత్నం
బ్రాహ్మణ కోడూరు



బెహరా ఉమామహేశ్వరరావు
శ్రీకాకుళం



యం. శేషాచారి
విశాఖపట్టణం



శ్రీ యల్. బుచ్చినాయుడు
చెర్లోపల్లి



బి.వి. చంద్రగుప్త
మదనపల్లి



సుంకర చెంగయ్య
గూడూరు



శ్రీ ని.యస్ వి.పి. పట్నాయక్
శ్రీకాకుళం



ఉయ్యూరు లక్ష్మయ్య
విజయవాడ



శ్రీ గుడివాడ పుల్లారావు
గుంటూరు



శ్రీ కిడారు మల్లయ్య
జనగాం



కె. మురళీధరరావు
కరీంనగర్



వెంకటాచార్యులు
ఏలూరు



ఎ. వి. గురునాథం
టంగుటూరు



సయ్యద్ హుసేన్
వరంగల్

# సుబ్రహ్మణ్య శతకము సవిమర్శక పరిశీలనము

కె.వి. రాజేంద్రప్రసాద్

ఆంధ్ర సాహిత్య చరిత్రమున శతక వాఙ్మయము విశిష్టము విఖ్యాతమునైన స్థానాన్ని సంపాదించుకొంది. ఇందు చారిత్రక సంఘటనల ప్రేరణతో; స్వానుభవ వ్యక్తీకరణతో, అధిక్షేపాత్మక శతక కర్తలననుకరించుచు వెలువడిన శతకాలలో 'సుబ్రహ్మణ్య శతకము' ఒకటి. ఈ శతకం బృహత్తటాకంనాగశాస్త్రికృతం కవి ఈ శతకంను క్రీ.శ. 1740 ప్రాంతంలో రచించినట్లు, దీనికి సుబ్బరాయశతకమనియు నామాంతరం ఉన్నట్లుగా డా॥ కె. గోపాలకృష్ణరావుగారు తమ 'ఆంధ్ర శతక సాహిత్యవికాసము'న సెలవిచ్చారు. శ్రీ నాగశాస్త్రి 'విప్రవంశము నుద్భవించియుండు చెగాని...' (57 పద్యం) అని చెప్పుకొనుటను బట్టి బ్రాహ్మణ వంశ సంజాతునిగ ఆయనను గుర్తింపవచ్చును. ఇట్టి సుబ్రహ్మణ్యశతకమున 1) శతకము-కవి 2) శతకము-ఇతివృత్తము 3) శతకము-రచనా విశేషములు 4) శతకము-సమకాలీన సాంఘిక రాజకీయ స్థితిగతులు. అను అంశములను గూర్చి సమీక్షింప బడుచున్నది.

1. శతకము-కవి

శ్రీ నాగశాస్త్రి ఆత్మాశ్రయ కవితాధోరణిలో సుబ్రహ్మణ్య శతకాన్ని రచించారు. మ్లేచ్ఛులగుట్ట గూర్చి-మట్టుసేయక యుండిన మహిమయేల' (49 పద్యం) అనుటనుబట్టి 18వ శతాబ్దంలో హైందవ పుణ్యక్షేత్రాలపై దాడిచేసి దేవాలయాలను ధ్వంసం చేసిన మహ్మదీయుల ప్రాభవాన్ని సహించలేక పోవడం ఒకవంక, మరొకవంక దారిద్ర్యం, అప్పులబాధలు, శూలాది రోగాలు, నేత్రరోగం మొదలగు వానిని కవి భరించలేక పోవడం (6,7 పద్యములు) వేరొకవంక సమాజంలో స్వార్థం విజృంభించడం, లోభులు పెరగడం; దానగుణం నశించడం, సంగీతసాహిత్య ప్రసంగాలకు విలువలేకపోవడం, మిక్కుటమైన అనావృష్టి మున్నగునవి (29,30,31,97 పద్యాలు) కవి హృదయాన్ని కృంగదీసినవి. ఆ ఆవేదనావేశంలో కవి నాగశాస్త్రి సుబ్రహ్మణ్య శతకమునకు పూనుకొన్నాడని నిర్ధారింప వచ్చును.

ఈ శతకమున 98 సీసపద్యములు మాత్రం లభ్యమగుచున్నాయి. శతక లక్షణాలలో ప్రధానమైన మకుట నియమం ఇందు విభిన్నంగా కనబడటం జరిగింది. మొదటి 50 పద్యాలకు 'శూర సంహారకకిరిగిరి సుఖవిహార-సుకవి జనగేయ శ్రీ బాలసుబ్బరాయ' అనియు 51వ పద్యము నుండి 'పన్నగసహాయ...' అని తెల్పబడింది. మరీ పద్య చరణమెట్లు పూరింపబడెనో తెలియ వచ్చుటలేదు. మరియు అక్కడక్కడ కొద్ది పద్యములకు మాత్రం 'సుకవి జనగేయ శ్రీ బాలసుబ్బరాయ'అని ఆఖరి చరణము మాత్రము మకుటంగా చూపడం

కూడ జరిగింది. ఉన్నపద్యాలు మాత్రం కంద గలవియై శాస్త్రిగారి కవితావైశిష్ట్యాన్ని చాటు తున్నాయి.

2. శతకము-ఇతివృత్తం :

సుబ్రహ్మణ్య శతకమునందు కొంత కవి జీవితమునకు, మఱి కొంత సమాజమునకును సంబంధించిన అంశములను ఇతివృత్తంగ గ్రహించడం జరిగింది. శాస్త్రిగారు సాంసారిక తాపత్రయములు, దారిద్ర్యము, అప్పుల బాధలు, శూలాది రోగములు మొదలగు దుర్భర పరిస్థితి నుండి తప్పించి, కరుణ జూపమని శంకరు నందనుడైన సుబ్రహ్మణ్యస్వామిని అర్థించారు. లోభులైన రాజులను నమ్మి మోసపోయినట్లు వాపోయినారు. సాహిత్యాన్ని మెచ్చి యిచ్చు దాతలు కఱవైనారని ఆర్తి నందినారు. ఆవేదనకు సానుభూతి కూడ దొరకనప్పుడు కవి వేదనావేశమును తట్టుకొనలేకపోయినాడు. 'నీచ సంతతిన్సంహరింప నీవు చాలవా?' (43ప) అని స్వామిని ప్రశ్నించారు. 'మ్లేచ్ఛుల గూల్చని నీ మహిమ నిరర్థకం' (45.ప)అని స్వామి అసమర్థతను నిరసించినారు. 'యెగ్గులేక నిన్నాశ్రయించిన వారికి వరములీయక బాధపెడ్తున్నావు. కనుకశక్తిధరుడు, శూరసంహారి, బ్రహ్మణ్యమూర్తి అనేపేరు రావాలంటే నీవు విజృంభించాలి. (11ప.) అని స్వామిని మందలించారు 'నీ తల్లి భర్త అర్ధ దేహాన్ని అధివసించింది. నీ తండ్రి పురములను గాల్చినాడు. నీ అన్న త్రోవలు కాచినాడు. వారివలె గాక నీవైనా ఆశ్రయించిన వార్ని ఆదుకొని మంచి వాడవనిపించుకొనుము' (12. ప) అని హితవు గఱపినారు. 'నాడు తారకాసురాది రాక్షసవీరులను సంహరించడం కాదు, నేటి పాషండులను గొట్టి శక్తిని నిరూపించుకో' అని సవాలు చేశాడు తన విన్నపాలు 'సుబ్బరాయడు' ఆలకించలేదని తలచిన కవి స్వామిపై కన్నెఱ్ఱజేసి మండి పడతారు.

సీ॥ సతి శిరంబున నుంచి సభలోన నటియించు
సిగ్గుమాలిన యట్టి శివుని కొడుక
భద్రకాళితనాన, బ్రబలి రుద్రుని చేత
గప్పెర నిచ్చు దుర్గాత్మజుండ
చేసెడు పనులెల్లఁ జెఱచివేసెడు పెన్మ
హోదరునికి కూర్మి సోదరుడవు
ధర్మభంగముచేసి ధరఁ బుణ్యజనులను
హరియించి నతని మేనల్లుఁ డనఁగఁ
బ్రజలు పలికెడి దుష్కీర్తి పాయునెట్లు
లోభమును ద్రోచి బహుదానలోలుడగుచు...
(88 ప.)

అని అధిక్షేపించినారు. మరల తానే నిగ్రహించుకొని పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తారు. దుర్నీతిపరుడైన తనను మన్నించుమని అర్థిస్తారు. స్వామివారి మయూర వాహనాన్ని ఉద్దేశించి తనదైన్యాన్ని ప్రభువుతో చెప్పిరమ్మని ప్రాధేయపడతారు. బాలసుబ్బరాయని 'నిన్ను వీడ'నని బ్రతిమలాడుతాడు. కొన్ని సందర్భాలలో రాజనీతిని, మంత్రిత్వాన్ని వివరిస్తాడు. చివరకు స్వామి అనుగ్రహానికి పాత్రుడై స్వస్థతను పొందుటతో శతకము ముగుస్తుంది. డొంక తిరుగుడులేని పద్ధతిలో స్పష్టంగ ఆత్మను నివేదించుకొనుట ఈ శతక ఇతివృత్త వైశిష్ట్యంగా పేర్కొ నవచ్చును.

3. శతకము- రచనా విశేషములు :-

సుబ్రహ్మణ్య శతక కవి శ్రీ నాగశాస్త్రి చేయి తిరిగిన మధుర కవి. పరిపూర్ణమైన భావుకతకు సలలితమైన భాష సైదోడై శతకపద్యములు విశిష్ట రచనా చమత్కారమును కలిగియున్నాయి.

కవిత యొక్క స్థూల రూపం ఛందోమయ రూపం. ఈ శతకము సీసపద్య సమన్వితము. సీసం దేశీయఛందం. ఉపజాతికిచెందింది. సీసానికి గీతపద్యం ఇంపుగ కూర్చబడింది. సీసాలలోకృతిని వెలయించుటను బట్టి కవికిదేశీయ ఛందమునందుగల

అభిమానం వ్యక్తమగుచున్నది. విపుల వర్ణనకు, విషయ విస్తరణకు సీసం అనువైంది. భావోద్వే గాన్ని అనుసరించి విభిన్న రీతులలో సీసపద్యం ఈ శతకంలో విశిష్టస్థాయగాన్ని సంతరించుకొంది.

'నారదమునిగాన సారలోలాహీన భూషణ మితదాన భూనిదాన' (83) అని ఒకమారు ముగ్ధ మోహన లయ విన్యాసంతో కొనసాగుతుంది. మఱొకమారు

'శరధి తుంగా భంగ వరతరంగా ఘాత ఘుమ ఘుమార్భటులు చేకూర్చి నాలో' (82) అని ప్రచండోద్రేక స్ఫూర్తిని సంతరించుకొనసాగింది. వేఱొకమారు

'కోటి విద్యలు గల్గి కూటి చింతలెకాని ధీశక్తి నిన్ను. బ్రార్థింపలేరు' (52.ప) అని మంద్ర గంభీ రముగను సాగింది ఇట్లు విభిన్న రీతులలోసీసాన్ని నవరసాల నాట్యమాడించిన ఘనత శ్రీ నాగశాస్త్రికి దక్కుతుంది.

కవికాలం నాటి సమాజమున కవితాపోషణ కఱవైంది. కవిత వ్యర్థమై కవి నిరాశా నిస్పృహ లకు లోనైనారు. అందున దుర్భర దారిద్ర్యమున చిక్కియున్న తనకు గోరుచుట్టుపై రోకటి పోటు వలె శూలాది రోగాలు పట్టి పీడించుతున్నాయి కవి లోని భావోద్వేగం వరదగోదావరిలా పరవడి చేసింది. ఈ క్రింది పద్యంలో కవి గుండెను కోసి పాఠకుల ముందుంచిన తీరు కడుంగడు విషాద భరితము.

సీ॥ సంగీత సాహిత్య సరస ప్రసంగ శృంగా
రంబు విని యిచ్చు వారు లేరు
రసవాదవైద్యంబు పసలేదు కరణిక మణి
యంబులను మానమంచు లేదు
సృష్టి జీవనాదులు కిరుదయ్యె నానాట నారీతి
నీమది కనుభవంబు
బిచ్చమెత్తుదమన్న బృథివిలోపల దాన
ధర్మంబు లెల్లను దరిగిపోయె
'నింకగతియేమి మాకు...... (31.ప.)

అని 'నారీతి నీకనుభవమే' నన్నారు. అడు క్కొని తినటానికి కూడ దాన ధర్మాలు చేసేవారు లేరని తన దైన్యాన్ని వివరించారు. విషాదపు నీలి నీడల నిలచిన కవి రూపం పాఠకులకు సాక్షాత్క రింప చేయటం జరిగింది.

తన ఇలవేల్పు కూడ తనగోడు వినలేదని తెలిసిన కవి ఆగ్రహోదగ్రుడౌతాడు. ఆవేశమున స్వామిని

సీ॥ నీ తల్లి చక్రాటం తిరూతురై దయలేక మగని
దేహంబును సగముచేసె
నీ తండ్రియేపాటి నీతిజ్ఞుడందును పట్టణం
బులు గాల్చి ప్రబలినాడు
నీ యన్న యెంతటి నిర్మలుడందును ఘన
కాంక్షం, ద్రోవలు కాచినాడు
నీ మేనమామయే నిజమువాండందునా
కొంచెమై కపుల యాచించినాడు
గీ॥ వారి వలెంగాకనీవైన వసుధలోన
నాశ్రయించిన భక్తుల నాదరించి
........................ (12. ప॥)

అని వ్యాజస్తుతిలో మందలించినారు. ఇంతే గాదు 'సిగ్గుమాలిన యట్టి శివుని కొడక' (33 ప.) 'ఎగ్గులేక నిన్నాశ్రయించితి' (38 ప) నంటాడు. ఇందులో స్తుతిగావించిన తీరు మిగుల మనోహరము వ్యాజస్తుతికి ఈ పద్యాలు నిసర్గరత్నాలు. హృద యాలను తడుముచున్న భావాలపొందిక హృద్యము.

కొన్నియెడల కవి స్వామివారిని పట్టి ప్రశ్నించి, వాదించినట్లుగ సంభాషణాత్మక శైలిలో పద్యాలను చెప్పట కూడ జరిగింది.

సీ॥ అను దినంబును నిన్నుఁగొన్నియాడు భక్తుల
కిష్టంబులీయ నీకేమికడవో
పూఁట పూఁటకునిన్ను మొరలెట్టు జనమును
బ్రేముడించుటకు నీకేమి కడవో
పెను ప్రాపుగను నిన్ను వినుతించు పేదల
నిలఁ గటాక్షించుటకేమి కొఱత
భద్రాత్మకా నిన్ను భజనచేసెడి కవి
స్తోమంబుఁ బ్రోవనీ కేమి లేదు

గీ॥ సర్వసర్వజ్ఞ సుతుఁడవై సాధుజనుల
జాలిఁబడఁజేయుటది నీకు మేలుగాదు'
శూర ......................(37. ప)

అని భక్తుల బాధించుట మేలుకాదు, కటాక్షించుమని అడిగినారు. 'రోసంబులేకున్న మీస మేల' (44 ప.) అని నిలదీసినారు. ఇట్టి పద్యములను లెక్కకు మిక్కిలిగనే శతకమున గలవు.

శబ్దార్థసౌందర్య సాధనములైన అలంకారములు శతకమున మిక్కిలిగనే ప్రయుక్తమైనవి. రసానుగత ప్రకృష్టవర్ణ విన్యాసమునకు మూలమైన అనుప్రాసాది అలంకారములు శతక పద్యాలకు వింత అందాన్ని కూర్చినవి.

సీ॥ క్రౌంచ గోత్రవిదార కాద్రవేయకహార
ధరణీ సురాధారధర్మసార
సర్వలోక విహారచంద్రమౌళికుమార యమిత
శృంగార విశ్వావతార (84 ప.)

మున్నగువానిలో పదాంతాను ప్రాసల ప్రాకారములు నిర్మించడంజరిగింది. ఇఁకవృత్త్యను ప్రాసము దాదాపు సగము పద్యములకు పైగ సంతరింపబడింది.

'తల్లిదండ్రులఁబ్రోచు తనయుండె తన
యుండు' (65 ప)

మొ॥ వానిలో లాటానుప్రాసలు శబ్దసౌందర్యమునకే గాక అర్థపుష్టికిని ఉపకరించినవి.

ఇక అర్థాలంకారములలో 'ఉపమానాలంకారము నాగశాస్త్రిగారు శతకమున పదే పదే మార్లు ప్రయోగించి కాళిదాస మహాకవి మార్గాన నడువ ప్రయత్నించినారు. ఆ తరువాత 'వ్యాజస్తుతి' మఱింత సౌందర్యాన్ని శతక పద్యాలకు కూర్చడం విశేషం, అని చెప్పవచ్చును.

సీ॥ భాగీరథిని ష్టీడిపల్యా లోదకములు వెదకి
గ్రుంకులు వెట్టు వెఱ్ఱిమాడ్కి
నిన్ను నేమఱి మూఢుడై య్యన్యసురలఁ
గొలవఁబోవుటవ్యర్థంబు కువలయమున...
(4.ప)

అని గంగానదీ స్నానములో సుబ్బరాయని సేవనమును భావించినాడు. సుబ్బరాయని కొలవనేరని వానిని పడియనీట స్నాన మాచరించు మూర్ఖునిగ చెప్పినారు. బాలసుబ్రహ్మణ్య స్వామిపై కవి కున్న పవిత్ర భావమును, ప్రగాఢ విశ్వాసమును ఈ ఉపమాలంకారము సుస్పష్టం చేయుచున్నది.

సీ॥ ధరగురు ద్రోహిని శిరసావహించిన యుగ్ర
శూలికి నీవు సుదయమగుట
మర్యాదయని లేక మృగనితో నెదురాడి శూ
రాడు కాశికిఁ గొడుకు గనుక
.... .... ...
యెగ్గులేకను నిన్నాశ్రయించిన జనుల
జాలిఁబెట్టేవు వరమిలీ,జాలకిప్రడు...(88.ప)

మొదలుగ ఉన్న పద్యములలో,నిందాపూర్వకముగ స్తుతియించి వ్యాజస్తుతిలో గల అందచందాల అతిశయమునకు కవి అద్దం పట్టినాడు.

ఇటుల సుబ్రహ్మణ్య శతకమున కవినాగశాస్త్రి సుమధుర కవితామృతమును ప్రవహింపచేసి తరించినాడన వచ్చును.

4. శతకము-సమకాలీన సాంఘిక రాజకీయ పరిస్థితులు

కవి కూడ సమాజములో ఒకడు కావున కాదనుకొన్నను సామాజిక రాజకీయ స్థితికి కొంత ప్రభావితం కాకతప్పదు. ఆ ప్రభావం అతని సాహిత్యంలో చోటు చేసుకొనుటయు అస్వాభావమేమియును గాదు.

18వ శతాబ్దమున హైందవ దేవళాలపై తురక దొరలు దాడిచేసారు. పెక్కు దేవాలయాలు ధ్వంసం కావటం జరిగింది. హైందవ సమాజం నాటి ముసల్మానుల ప్రాభవాన్ని యథాశక్తి ప్రతిఘటించటమూ జరిగింది. కాని ఫలితం శూన్యమైన స్థితిలో ఆర్తిని సాహిత్యాది కళల ద్వారా ప్రకటించడం జరిగింది. అందుచేతనే శాస్త్రిగారు 'మ్లేచ్ఛుల గుట్ట గూర్చిపట్టుసేయకయుండిన మహిమయేల' (49 ప) అని, 'తురకచయము బురఖాలు కప్పికొనునట్లు' (71 ప) అని స్వామికి భావించిన ఆత్మ నివేదనంలో ప్రస్తావించడం జరిగింది.

నాడు దుర్మార్గము. దుర్నీతి ఎక్కువై అవనీసురులను ఆదరించలేదని శతకర్త వాపోయినాడు (17 ప) వైద్యమున పసనశించినది. దానశీల మడుగంటినది (81 ప) అనావృష్టి ప్రబలిరైతులు అల్లాడినారు (97). కోటి విద్యలు నేర్చి కూడు సంపాదించుట్లెగాని దైవధ్యానము నశించినది. పరధనమును దోచుకొనుట, పరదార (భార్య)లను బాధించుట ఎక్కువైనది.

ధనము లార్జించిన వారు తాము తినక దాచుకొను చున్నారు కాని దాన మిచ్చేవారులేరు యౌవనమును దాసీ స్త్రీకి ధారపోయుటయే గాని కులకాంతను సుఖపెట్టడంలేదు (52 ప) అని తెలుస్తోంది. ఈ అంశాలన్నీ కలికాలంనాటి సామాజిక పరిస్థితిని సమగ్రంగా తెల్పజాలియున్నాయి.

ఇంక రాజులు రాజనీతికి సంబంధించిన కొన్ని రాజకీయ విషయముల ప్రసక్తియు కానవస్తోంది. చతుర్విధ యుక్తి చతురుడు, ధర్మమర్మజ్ఞుడు, ప్రభుభక్తి యుక్తుడు అమాత్యపదవికి అర్హుడంటారు. (24,25పద్యాలు) అందున విజ్ఞుడైన బ్రాహ్మణుడే మంత్రిపదవికి సమర్థుడని చెప్పి కవి కొంత పక్షపాత దృష్టిని ప్రదర్శించడం కూడ జరిగింది. దుష్టజన విసర్జనుడు, దాననిరతుడు, లోకరహితుడు, విప్రధనాన్ని విషంగా భావించే రాజే ఉత్తముడని నిర్ధారించడం జరిగింది ఇంతగా నొక్కి చెప్పడం వలన నాడు విప్రధనాన్ని హరించిన రాజులు కొందరుండియుందురను విషయం స్పష్టపడుతోంది. ఇంతేగాక రాజు, మంత్రి, సేనానాయకుడు మొదలగు వారి ప్రవర్తన, సుగుణ సంపత్తిని నాగశాస్త్రికవి చాల స్పష్టంగా, విపులంగ శతకమున వివరించినారు. కిస్తు, ముస్తీదులు, బురఖా మొదలగు హిందూస్తానీ పదాలను కవి పెక్కుచోట్ల విరళంగా ప్రయోగించి, నాడు సామాజికంగా వున్న మహమ్మదీయభాషా ప్రభావాన్ని పరోక్షంగా కవి తెల్పారు.

సుబ్రహ్మణ్యశతకము విస్తృతిలో చిన్న శతకం అయిననూ విషయవిస్తృతిలో విపులమైన మహాకావ్యంగా సాహిత్యప్రపంచాన దర్శనమిస్తోందని తనదైన ప్రత్యేకమైన ఉన్నతస్థానాన్ని సంపాదించిందన వచ్చును. 'విశ్వశ్రేయః కావ్యమ్' అన్న ప్రథమాంధ్రాచార్యుల వారి వాక్యమున శ్రీ బృహత్తటాకం నాగశాస్త్రి శతకరచన ద్వారా నిజం చేశారు. ధన్యులైనారు.

# తెలుగు విశ్వవిద్యాలయపు ఆంధ్ర మహాభారతము కతిపయ పాఠ పరామర్శ

ఇప్పగుంట సాయిబాబా

తెలుగు విశ్వవిద్యాలయము వారు కవిత్రయ ఆంధ్ర మహాభారతమును ముద్రింపదలచి, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధిత ముద్రణను ప్రక్కకుపెట్టి, ఆనందముద్రణ ప్రతినియథాతథంగా ప్రతిబింబ ముద్రణగా వెలువరించింది. అర్థబలము, అంగబలము పుష్కలముగా కల తెలుగువిశ్వవిద్యాలయం తిరిగి ప్రామాణిక విద్వాంసులచేత సరిచేసి మహాభారతమును ముద్రించక, కొన్ని దశాబ్దాల నాటి ముద్రణను ప్రతిబింబ ముద్రణ రూపంలో 1989లో వెలువరించినతీరు నిరుత్సాహంగాఉన్నది కనీసము నన్నయ భారత భాగానికైన విపుల పాఠాంతరములతో కూడిన సంశోధిత ముద్రణను మనం ఇప్పటికినీ ఏర్పరచు కోలేదంటే తెలుగువారి మాతృభాషాసక్తి ఎట్టిదో వివరించ నక్కరలేదు.

ఆదిపర్వం-ద్వితీయాశ్వాసం-174. పద్యం
....భిన్న కుంభమున తోయమ్ములట్టుల....

'భిన్న కుంభమునఁ దోయము లిట్టుల' అని వ్యస్తముగా నుండుట భావ్యము.

ఆదిపర్వం, తృతీయాశ్వాసము-206 పద్యం
సీసపు మూడవపాదపు మొదలు 'కడనుండ కున్నది' అనిన దానిని 'కడనున్కి-విడునది' అని సవరించిన గాని అర్థము చేసికొనలేము.

ఆదిపర్వం, తృతీయాశ్వాసము-214 పద్యం
—'యయాతి యనఁగఁ జనియెడు వాఁడన్'

దీనికి పాఠాంతరము 'సడిసనువాఁడన్' అను నదియే సుష్ఠువు. అపకీర్తి లేనివాడను, ప్రసిద్ధి కెక్కినవాడను అను అర్థమిచ్చు చక్కని జాతీయ ప్రయోగము.

పంచమాశ్వాసము-176.
—వ్యవసాయుల చెయ్వులర్థవంతములగునే.'

'చెయ్వులు' కంటె 'చెయ్వుఌ' ప్రాచీన రూపము. పనులు, క్రియలు అని అర్థము. ప్రాచీన రూపములను సాధ్యమైనంత వరకు ఉద్ధరించాలి. ఇది సంపాదకుని ప్రథమ కర్తవ్యము.

ఆదిపర్వం, పంచమాశ్వాసము-208 పద్యం
...పలుగుఁదనంబునం బలుక బాడియె నీ సఖినంచు...

అచ్చుతప్పులు దిద్దకుండ ముద్రించడం తెలుగు విశ్వవిద్యాలయం వంటి గొప్ప సంస్థలకు న్యూనత. 'పలుచఁదనంబునం' ఒప్పు. ఇక సఖి స్త్రీ లింగం. కనుక 'నీ సఖుఁడంచు' అని ముద్రించుట పాడి. వావిళ్ళ ముద్రణము నందు కూడ పె పాఠమే కలదు.

ఆదిపర్వం, షష్ఠాశ్వాసం-91 వచనం.

...యుధిష్ఠరు రాజ్యభార ధురంధరుంగా నెఱింగి అని ముద్రితపాఠము. 'భార'-'ధురం' పునరుక్తములు. ఏదో ఒకటి ఉండిన చాలు. ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధిత పాఠమెద్దియో?

'నూట' కళగా ముద్రితము. తప్పు. అది ద్రుతప్రకృతికము. చూడు-దీపాలి పిచ్చయ్యశాస్త్రి గారి సాహిత్య సమీక్ష.

ఆదిపర్వం, ద్వితీయాశ్వాసం 37 వచనం

'....వినతయుం జని యత్తురంగంబుఁ జూచి వినత యోటువడి —'ముద్రిత పాఠము అన్నింట సమము, 'చూచి' అనుటకంటె 'చూడ' అనుట అర్థవంతముగా ఉన్నదికదా?

ఆదిపర్వం, అష్టమాశ్వాసం-310 వచనం.

—మేము దహన క్లేశంబునం బొందినను— ఇచ్చట 'దహక్లేశము' అనుట అర్థస్ఫూర్తికి సదానమగుచున్నది కదా? 'న' అక్షరము వర్జ్యము (త్యాజ్యము).

విరాటపర్వం, ద్వితీయాశ్వాసం-16 పద్యం

నాల్గవపాదం మొదలులోని 'జళికి పట్టినమను సన్నపు విన్నాణము —'సరికాదు. 'జడికి' అనగా మల్లబంధ విన్యాసము, 'జడికి' పట్టినమును సన్నపు విన్నాణము అనునది సుష్ఠు.

విరాటపర్వం, చతుర్థాశ్వాసం-9పద్యం

'ఎత్తునఁగొందుఁగౌరవుల—అని ముద్రితము. పాఠాంతరమైన 'ఎత్తెల గొందు' అనేదే సుష్ఠు. 'ఎత్తెలగొను' అనగా వలలో పెక్కు చేపలను పట్టినట్లు సులువుగా పట్టుట

ద్రోణపర్వం, పంచమాశ్వాసం—26పద్యం

...వెఱవును గఱకలునులేవు...అనుముద్రిత పాఠముకన్న వ్రాత ప్రతులలోని 'కఱదులును' అను పాఠమే శుద్ధము. కఱద = మోసము.

కర్ణపర్వం — తృతీయాశ్వాసం—24పద్యం

...కర్ణు చేత గోల్పోయెఁగదే!ముద్రితపాఠము సూ.ని. 'కోల్పడు' = హింసింపబడు అను అర్థమును ఇచ్చి కర్ణుచేతఁగోల్పడి యెఁగదే' అనుసుష్ఠు పాఠమిచ్చినది. ప్రామాణికమైన కవిత్రయ మహాభారతముతో బాటు ఆంధ్రమహాభారత కోశమును గూడ ప్రచురించుట తెలుగు విశ్వవిద్యాలయ బాధ్యత.

# పారస్ నామ్

ఎ. సునీల్ రాజ్

పారస్ నామ్ పారస్నామ్
నా ప్రభువే పారస్ నామ్
నీ నామమే నా జపము
హే మంగళప్రద పారస్ నామ్
మనస్సునే జ్యోతిలా వెలిగించాము.
నీ శరణానికి వచ్చాము
హే పాలనహారి పారస్ నామ్
నా ప్రభువే పారస్ నామ్

నీ చరణమే మా శరణము
నీ నామమే మా జపము
దీపాలే వెలిగే నీద్వారంలో
పూజించాము భక్తి భావంతో
క్షణ క్షణం నీ నామమే మా జపం
నీ ద్వారమే మా స్వర్గం
* పారస్నామ్ పారస్నామ్ *
* నా ప్రభువే పారస్ నామ్. *

### ప్రవరుని హిమవన్నగాగమన ముఖ్యోద్దేశ్యము

# వరూథినీ ప్రవరుల సంభాషణా క్రమము పై రుథ్యావంతి

'అమరలేఖిని'

వివరణాత్మకముగ రచించి, లక్ష్యమును విశ్లేషించి దెల్పుటయే లక్ష్యముగా పై శీర్షికలో ఈ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశ్యము.

ప్రవరుని నివాసస్థలమును గూర్చి ప్రథమాశ్వాసమున ఆంధ్రకవితా పితామహుఁ డీవిధముగా వర్ణించెను.

వరణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ
చుంబితాం
బరమై సౌధసుధా ప్రభాధవళితప్రాలేయ
రుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యా
వర్తదేశంబునన్
బురమొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తిన్
విడంబింపుచున్.

అచ్చటి చాతుర్వర్ణములను వారి శక్తియుక్తులను గూర్చిన ప్రశంసాప్రసక్తి నీక్రింది విధముగ పెద్దన వివరముగ వర్ణించెను.

సీ॥ అచటివిప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముది మది దప్పిన మొదటివేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవు నైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటి మేటికిరాటు లలకాధిపతినైన
మును సంచి మొదలిచ్చి మనుపఁదక్షు
లచటి నాలవజాతి హాలముఖాత్త విభూతి
నాదిభిక్షువు భైక్షమైన మాన్చు

తే. నచటి వెలయాండ్రు రంభాదులైన నారయఁ
గాసె కొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖా కళా దురంధర నిరూఢి
నచటఁబుట్టిన చిగురుఁ గొమ్మైనఁజేవ.

అచటఁబుట్టిన విప్రకుమారుడు 'చతురాస్య వంశకలశోదధి, పూర్ణశశాంకుడు' ప్రవరాఖ్యుడు ప్రవరకుమారుని గుణగణముల నీక్రింది రీతిని ప్రస్తుతించెను.

ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంక శశాంక
మనోజ్ఞమూర్తి భా
షా పరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ
కర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహ గర్భకులాభరణం
బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్య
తనూ విలాసుఁడై

ఆ. వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్షసేయు జార కామినులకు
భోగ బాహ్యమయ్యె। బూచిన సంపెంగ
పొలుపు మధుక రాంగనలకుఁ బోలె.

ఈ పద్యమును పెద్దన రచించుటలో భవిష్యత్ కథాసూచ్యార్థమును అర్థవంతముగ తలపించుచున్నది.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై
కమనీయ కౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసిన కూరిమి
సోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు
గూడి దేవియున్
దేవర వోలె నుండి యిలుదీర్పఁగఁ గాపుర
మొప్పు వానికిన్

పై పద్యములో పెద్దన కవీంద్రులు ప్రవరుని పైఁగల యభిప్రాయమును నిస్సందియముగ ప్రకటించెను; అద్దాని ననురించి ప్రవరుడు మనుచరిత్ర మను మహాప్రబంధమున కథా నాయకుఁడు కాజాలడని గ్రహించఁగలరు. ఈ భావమును 4వ పాదమున 'ఇలు దీర్పఁగఁ గాఁపురమొప్పు వానికిన్' అనుట ధృవీకరించుచున్నది. 'క్రాంతదర్శినః కవయః' అన్న లక్షణకారుని సూత్రము పెద్దనగారి కావ్య నిర్మాణ కౌశలమునకు వన్నె జేకూర్చుచున్నది.

ప్రవరునిది తీర్థయాత్రా సందర్శనాభిలాష

సీ॥ తీర్థసంవాసు లేతెంచిరా రని విన్న
నెదురుగా నేఁగు దవ్వెంతయైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చు
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్దరఁ గల్గు వనధి పర్వత సరి
త్తీర్థ మహాత్మ్యముల్ దెలియనడుగు

తే. నడిగి యోజన పరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచునూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థ సందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరు ణాగ్నిహోత్రి.

పై విధముగా ప్రవరుని దైనందిన యనుష్ఠాన క్రమము సాగుచున్నది. అతని తీర్థ సందర్శనాభిలాష ప్రగాఢమైనది,

కం. ఈ విధమున నభ్యాగత
సేవాపరతంత్ర సకల జీవనుఁడై భూ
దేవ కుమారకుఁ డుండం
గా వినుమొకనాఁడు కుతపకాలమునందున్

తే. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళింపఁ
గావి కుసుమంబు జలకుందికను బూని
చేరెఁ దద్గేహ మౌషధ సిద్ధుఁ డొకడు.

ప్రవరుడు ఆ సిద్ధుని కర్ఘ్య పాద్యాది పూజనం బాచరించి, యిష్ట మృష్టాన్న కలన సంతుష్టుఁ జేసి, ఎందుండి యెందుఁ బోవుచు నిందులకే తెంచినారలని యడిగెను. సిద్ధుని రాకచే తన మంధిరము పవిత్ర మయ్యెననియెను. తాను మాన్య చరితుడైనందుకు సంతసించెను ప్రసంగ వశమున సిద్ధుని నిట్లు ప్రార్థించెను:-

శా. ఏయే దేశములన్ జరించితిరి మీరేయే గిరుల్
చూచినా
రేయే తీర్థములందుఁగ్రుంకిడితి రేయే ద్వీప
ముల్ మెట్టినా

రేయ్ పుణ్యవనాళిఁద్రిమ్మరితి రేయే
తోయధుల్ డాసినా
రాయా చోటులఁ గల్గు వింతలు మహాత్మా!
నా కెఱింగింపరే

తే. పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిల కల్మషహరంబ
కాన వేఁడెద ననిన నమ్మౌనివర్యుఁ
డాదరాయత్త చిత్తుడై యతని కనియె

ఉ. ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జానపదంబులు పుణ్యనదీ నదంబులన్
జూచితి నందు నందు గల చోద్యములన్గను గొంటి నాపటి
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశా చలంబుగన్

శా. కేదారేశు భజించితిన్ ; శిరమునన్ గేలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్! ప్రయాగ నిలయుం బద్మాక్షు సేవించితిన్ ;
యాదోనాథ సుతాకళత్రు బదరీనారాయణున్ గంటి, నీ
యాదేశంబననేల? చూచితి సమస్తాశావ కాశంబులన్.

మ. అనినన్ విప్రవరుండు కౌతుక భరవ్యాక్రాంత రంగుండు, భ
క్తిని బద్ధాంజలి బంధురుండు నయి మీదివ్య ప్రభావం బెఱుం
గని నా ప్రశ్నదముల్ సహించి మునిలోక గ్రామణీ! సత్కృపన్
నను మీశిష్యునిఁ దీర్థయాత్రావలనన్ ధన్యాత్ముఁగా జేయరే.

అని వేడుకొనియెను.

క. అనుటయు రసలింగమునిడు
తన వస్త్రువ ప్రేపఁ సజ్జ దంతపు బరణిన్
నినిచిన యొక పసరిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజ యుగళిన్

క. ఆ మందిడి యతఁడరిగిన
భూమీసురుఁడరిగె, దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాద్యదరీ ఝరీ నిరీక్షాపేక్షన్.

ప్రవరుని హిమవన్నగాగమ లక్ష్యము సఫల మయినదా? లేదనే చెప్పవలెను.

చం. అడఁజని కాంచె భూమి సురుఁడంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద భంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనట నానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపిత సాలము శీత శైలమున్

శీత శైలమును గాంచి ప్రవరుని యంతరంగము ఆనంద తరంగితమైనది పులకాంకితమైనది. గిరి కటక తట నిరంతర తరు గహన గుహా విహార తత్పర మతియై నతఁడీ విధముగ తలపోసెను.

సీ. నిడద పెన్నెఱి గుంపు జడగట్టు సగరు మ
మ్మనుమండు తము గైకొనిన చోటు
జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేరు దిగినటోటు
పుచ్ఛడీక తనంబు పోఁచెట్టి గిరి కన్య
పతిఁగొల్వ నాయాసపడిన చోటు
వలరాచ రాచవారలికాతుకన్ను వెచ్చఁ
గరఁగిన యలకనికరపుఁజోటు

తే. తపసియిల్లాంద్ర చెలువంబుఁ దలఁచి తలఁచి
మున్ను మచ్చిచ్చును విరాళి గొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాఁఱఁగన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుందాత్మలోన.

మ. తలమే బ్రహ్మకునైన నీనగ మహత్త్వం
బెన్న నే నియ్యెడన్
గఁ చోద్యంబులు జేపు గన్గొనియెదన్ గాకేమిః
నేఁడేగెదన్
నలినీ బాంధవ భాను తప్త రవికాంతస్యంది
నీహార కం
దళ చూత్కార పరంపరల్ పయి పయిన్
మధ్యాహ్నమున్ దెల్పెడిన్.

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహార వారి
బెరసి తత్పాదలేపంబు గరఁగిపోయెఁ
గరఁగి పోవుట యెఱుఁగఁ డద్ధరణి సుతుఁడు
దైవ కృతమున కిల నసాధ్యంబు గలదెః

మ॥ అతఁ డట్లౌషధ హీనుఁడై నిజ పురీ యాత్రా
మిళత్కౌతు కో
ద్ధతిం బోవన్ సపది స్ఫుటార్తిఁ జరణ
ద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హాః
నన్నిట్లు దైవంబ! తె
చ్చితె యీ ఘోర వన ప్రదేశమునకున్
సిద్ధోపదేశంబునన్.

కం. ఎక్కడి యరుణాస్పద పుర?
మెక్కడి తుహినాద్రిః క్రొవ్వియే రాఁదగునేః
యక్కటః మును నను దెంచిన
దిక్కిది యని యెఱుఁగ వెడలు తెరు
వెయ్యదియోః

మ. అకలంకౌషధ సత్వమున్ దెలియ మాయా
ద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే
సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్రమ
మిమ్మంచుఁ గొం
డకు రాఁజెల్లునెః బుద్ధి జాడ్య జనితోన్మాదున్
గదా! శ్రోత్రియుల్.

పై పద్యములో పేర్కొనిన తీర్థయాత్రా స్థల సందర్శనమునకు బదులుగ మంచుకొండకు వచ్చుటలోఁ గల తన బుద్ధి జాడ్యము వల్ల జనించిన ఉన్మాదమే గదాః అని వాపోయెను.

కనుక ప్రవరుని లక్ష్యమైన 'తీర్థయాత్రా సందర్శనాభిలాష' నెరవేర లేదని మంచు కొండకు తాను వచ్చుటలో తన తెలివి లేమిని చాటుచున్నది తప్ప వేరొక ప్రయోజనము కలుగలేదని యొప్పు కొను చున్నాడు గదాః

పెద్దన కవీంద్రుల లక్ష్యము, వరూధినికి, ప్రవరరూప రేఖవిలాసమనిన లోకోత్తరమని, సిద్ధ సాధ్య గరుడ గంధర్వ సుర నర ఖేచర చారణాది కుమారులలో నే యొక్కరు సాటి కారని, దెల్పుటకే నని దెలియుచున్నది గదా! ఆమెచే ప్రవరుడు నల కూబరసన్నిభుడని చెప్పించి, వానియందే వరూధిని మనసు లగ్నమైయుండినదని,పాఠకులనొప్పించి ద్వితీయా శ్వాసమున ప్రవరుడు నిత్యాగ్నిహోత్రి, నిష్టా గరిష్టుడని, పరదార ధనవ్యామోహముల కతీతుఁడని నొక్కి వక్కాణించి కథాగమనమును కొనసాగించిన తీరు గమనార్హము.

ఇంతటితో నీ చర్చను ముగించి వ్యాస శీర్షికలోని ద్వితీయాంశమును అనగా 'వరూధినీ ప్రవరుల సంభాషణా క్రమమునందలి వైరుధ్యమును పరిశీలింతము.

మున్ముందుగా పాత్రలు-ప్రవరుడు వరూధిని-భిన్న మనో ప్రకృతులు కలిగిన వారలు, పరస్ప రానురాగ బద్ధులు గారు. ప్రవరుడు స్వపత్నీయను రాగవినోదాసక్తుడు. పరదారయందు రాగములేని

వాడు నియమ నిష్ఠాగరిష్ఠుడు నిత్యాగ్ని హోత్రి. వైదిక కర్మ ధర్మము లాచరించుటలో నిష్ఠానుష్ఠాన మున క్రమము తప్పనివాడు. వరూధిని, లోకోత్తర రూప యౌవన తనూ సౌందర్యవంతుడు కంతుని-వసంతుని మొదలుగా-దేవకుమారుల కంటెను రూపసి; కనుక ప్రవరుని పొందిన తన భవము సార్థకము, చరితార్థము అని నమ్మిన గంధర్వ వనిత; నారీ శిరోరత్నము.

వీరిరువురి చిత్త ప్రవృత్తులు పరస్పర విరుద్ధములు, వీరిరువురి మధ్య శృంగార రస ప్రధానముగ-వరూధినీ సంభాషణము-ప్రవరునికి భిన్నము. ప్రవరుని సంభాషణ పద్ధతి-తీరు-వరూధినికి విరుద్ధము.

క్లుప్తముగచెప్పుచో నీ యిరువురు మానసిక ప్రవృత్తిలో సరిపడని దృక్పథములు గలవారు. ఒకరు ఉత్తర ధృవము. మరొకరు దక్షిణధృవము. వీరిరువురి జీవన సతళి-రెండు సమానాంతర రేఖలఁ దలపించును.

కనుకనే వీరి శృంగారము రసాభాసముగా సాహిత్య లక్షణకారుడు చెప్పియుండెను. ఇంతటితో నీ చర్చముగించి, వీరిరువురి శృంగారమును గూర్చి పెద్దన కవీంద్రులు-హిమవన్నగముపై సాగించిన ప్రసంగ వైరుధ్య భావప్రకటనాత్మకమైన పద్యము, వాక్ప్రతి వాదమువలె కర్ణ శ్రావ్యముగ విన్పించిన-కొన్ని పద్యములను మరొక మారు శృతిపేయములైన వాటిని విని-యానందింతము.

పాఠకసహృదయులు వినియానందించుటలో తప్పు లేదు కదా!

ప్రవరుడు మొట్టమొదట వరూధినిని చూసి నప్పుడామె యందచందములు వర్ణి పబడియెను. గమనింపుడు.

మ. అతఁడావాత పరంపరా పరిమళ వ్యాపార
లీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్
విద్యుల్లతావిగ్రహన్
జక్రస్తనిన్.
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్ జంద్రాస్యఁ
జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నౌకానౌక మరున్నారీ
శిరోరత్నమున్.

పెద్దనకవీంద్రులు వరూధినిని యాదు విశేషణములతో వర్ణించెను. వాటినియథో సూచిత గీతలతో గుర్తించఁగలరు పాఠకులు

సీ. తతనితంబా భోగ దవళాంశుకములోని
యంగదట్టపు గావిరంగు వలన
శశికాంత మణిపీఠి జాజువాఱఁగ గాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత తంత్రీ స్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపఁ గతిఁ జొక్కి యరమోడ్పుఁగను
దోయిరతిపారవశ్య విభ్రమముఁ దెలుపఁ

తే. ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకుఁ
గ్రమకర పంకరుహరత్న కటక ఘుణఘు
ణ ధ్వని స్ఫూర్తి తాళమానములు గొలువ
నింపు దళుకొత్త వీణ వాయింపు చుండి

అబ్బురపాటుతోడ నయనాంబుజముల్
వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీకల్ వికసితోత్పల పంక్తులఁ
గ్రుమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్
మదిలోనఁ గోరికల్
గుబ్బతిలంగఁ జూచె నలకూబర సన్నిభు
నద్ధరామరున్.

ఉ. ఎక్కడివాడొ? యక్షతనయేందు జయంత
వసంత కంతులం
జక్కదనంబునన్ గెలువఁజాలెడు వాఁడు
మహీసురాన్వయం
బెక్కడ? యీతనూ విభవ మెక్కడ? యేలని
బంటుగా మరున్
డక్కఁగొనంగ రాదె! యకటా!నను వీడు
పరిగ్రహించినన్
అని యాత్మలోఁ దలపోసినది వరూధిని.
ఆమె గంధర్వకన్య.

ప్రవరుడు విప్రుడు ప్రవరుని భర్తగా
తానతని పొందులో సుఖించుటయే వరూధిని
లక్ష్యము

క. సురగరుడోరగ నర ఖే
చర కిన్నర సిద్ధసాధ్య చారణ విద్యా
ధర గంధర్వ కుమారుల
నిరతము గనుఁగొనమె? పోలనేర్తురె వీనిన్?
మ. అని చింతించుచు మీన కేతన ధనుర్జ్యా
ముక్త నారాచ దు
ర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహదీయెపించు
పెం దత్తఱం
బుసం బేర్చెత్తిన లజ్జ నంఘ్రికటకంబుల్
మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యుచ్చరఁజూచి చేరఁజని పల్కెన్
వాఁడు విభ్రాంతుఁడై.
ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి జరించె
దోట లే
కివ్వన భూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడ
ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి
పురంబుఁ జేర నిం
కెవ్విధిఁగాంతుఁ? దెల్పఁగదవే! తెరువెద్ది?
శుభంబు నీకగున్.

పై పద్యమును నిశితముగా గమనించినచో
ప్రవరుడు వట్టి శ్రోత్రియుడేగాక బాంధసుడు గూడ
అని తెలియును. 'శుభంబు నీకగున్' గమనార్హము.

క. అని తన కథ నెఱిఁగించిన
దన కనుఁగవ మెఱుఁగులబ్బఁ దాటంకము
లున్
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత సెలదివాలు నవ్వి వానికి ననియెన్.
వరూధిని నవ్వుటలోగల భావము ప్రవరుని
బాంధసమును గూర్చియే!

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు?
భూసురేంద్ర ! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి
పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుంగవే మునువచ్చిన
త్రోవ చొప్పు ? నీ
కింత భయంబులే కడుగ నెల్లిద మైతిమె ?
మాట లేటికిన్?

అని నర్మ గర్భంబుగాఁబలికిన వరూధిని
ప్రవరునికి తనను గూర్చి సగర్వంబుగా నిట్లు
చెప్పుకొనియెను. ఈ క్రింది సీసపద్యము శ్రీనాథ
కవిసార్వభౌముని;'నళిన సంభవు సాహిణమువారు
వంబులు, కులముసాములు మాకుగువలయాక్షి!'
చూ 'శృంగార నైషధం'లోని (అ 2 ప.49) సీస
మును తలపించుచున్నది.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్టు జంత్రగాత్రముల తోఁ గరఁగించు
విమల గాంధర్వంబు విద్యమాకు

ననవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినదిమాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు టంకువలు మాకుఁ

తే. గనకనగ సీమఁ గల్ప వృక్షముల నీడఁ
బచ్చరా చట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాము గరిడీలు మాకు గోత్రామరేంద్ర!

క. పేరు వరూధిని విప్ర కు
మార! ఘృతాచీ తిలోత్తమా హరిణీ హే
మా రంభా శశిరేఖలు
దార గుణాఢ్యలు మదీయలగు ప్రాణసఖుల్.

మ. బహురత్నద్యుతిమేదురోదర దరీ భాగం
బులం బొల్చు ని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడుం
బ్రేమన్ న భోవాహినీ
లహరీ శీతల గంధ వాహ పరిఖేల న్మంజరీ
సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంత
తార సంతానముల్.

క. భూసుర! కైతవ కుసుమ శ
రాసన! మాయింటి విందవైతివి, గైకొ
మ్మాసము దంచన్మణిభవ
నాసీనత సేదదేఱి యాతిథ్యంబున్

తే. కుందనము వంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁగందె, వడ దాఁకె నొప్పు లొలుకు
వదన, మస్మద్గృహంబు పావనముసేసి
బడలికలు వాసి చనుమన్న బ్రాహ్మణుండు.

ఉ. అందజయాన! నీ వొసఁగునట్టి సపర్యలు
మాకు నచ్చెం, నిం
దుండఁగ రాదు, పోవలయు నూరికి, నింటికి
నిప్పుడేను రా

కుండ నొకండు వచ్చి మఱియొండునె?
భక్తియ చాలు సత్క్రియా
కాండముఁదీర్ప వేగ సనఁగావలయున్ గరు
ణింపునాపయిన్.

ఏనిఁక నిల్లుసేరుటకు నెద్దియుపాయము?
మీ మహత్యముల్
మానిని! దివ్యముల్ మదిఁదలంచిన నెందును
మీ కసాధ్యముల్
గానము గానేఁదల్లి! ప్రజలన్ నను‌ఁగూర్చు
మటన్న లేఁత న
వ్వాననసీమఁ దోఁఁడ ధవళాయతలోచన వాని
కిట్లనున్.

పైపద్యములో మూడవ పాదమున ప్రవరుడు వరూధినిని 'దల్లి'! అనిసంబోధించెనుగమనించితిరి గదా! అప్పుడైన వరూధిని తన ప్రయత్నము విరమించుకొని యుండవలసినది! తద్భిన్నముగ నామె 'యానన సీమ లేఁతనవ్వు దోఁప' అని పెద్దన కవీంద్రులు పద్యమును కొనవరకు నడిపించి వరూధిని మానస ప్రవృత్తిని పాఠకులకు దేట తెల్లము కావించెను.

ఉ. ఎక్కడి యూరు? కాల్నిలుపకింటికిఁ బోయెద
నంచు బల్కెదీ
వక్కట! మీ కుటీర నిలయంబులకున్ సరికాక
పోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి నందన
చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము, లిక్కడి యీలవలీ
నికుంజముల్?

అని నిస్సంకోచముగా నెత్తిపొడిచి తన యునికి కాట పట్టయిన స్థలవైభవ శ్రీలఁ గొని యాడుచు ప్రవరుని 'కుటీర నిలయంబులు' అని ఈసడించెను. తన మనోరథము నీడేర్చుకొనియెడు

నుద్దేశ్యము నీ విధముగ వెలిబుచ్చెను. వరూధిని ప్రవరునితో.

ఉ. నిక్కము దాఁపనేల? ధరణీసురనందన! యింక నీ పయిం
జిక్కె మనంబు నాకు, ననుఁ జిత్తజు బారికి నప్పగించెదో?
చొక్కపు మరంద మద్యముల చూఱలఁ బాటలు వాడుతేంట్లు సొం
పెక్కిన యట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెదో?

ఇంత దనుక వచ్చినను మాటలకు బదులు చేతలు గోరుచున్నదైన వరూధినీ కామితార్థము దెలిసిన ప్రవరుడు ధర్మకర్మ దీక్షాపరుడు కావున సున్నితముగ వరూధినిని మందలించెను ఆ విధముఁ గమనింపుడు

క అనుటయుఁ బ్రవరుండిట్లను
వనజేక్షణ! యిట్లు వలుకవరుసయె? వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కావింప? మది విచారము వలదే?

ఈ మందలింపు వరూధిని పెడనెవినిఁ బెట్టి నట్లూర కుండెను. తన తప్పిదమును గ్రహించినట్లు కూడ నగపడదు. ప్రతిసమాధాన మియ్యక ఆలోచనా నిమగ్న మయ్యెనని పాఠకు లూహింపగలరు. 'కామాతుర' యైన వరూధినికి లజ్జగాని భయము గాని యున్నట్లగుపించదు.

ధర్మకర్మాచరణ మందు క్రమము తప్పని ప్రవరుడు మరోమారు తన విన చర్యకు భంగము వాటిల్లినదని వాపోవుచు పలికిన యీ క్రింది పద్యము ను గమనించిన ప్రవరుని స్థితి పఙ్త్వ మెట్టిదో తెలియును.

ఉ వేలిమియున్ సురార్చనము విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె, జననీ జనకుల్ కడు వృద్ధు, లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్నినేఁ
దూలు సమస్త ధర్మములఁ దొయ్యలి! నేఁడిలు సేరకుండినన్.

వరూధినికి ప్రవరుని పై మాటలు విన్నఁ బాటు దోఁపనిట్లని పలికెను.

ఉ. నావుడువిన్నబాటు వదనంబుననించుక దోఁ పఁ బల్కె 'నో
భావజరూప! యిట్టి యెల ప్రాయము వైదిక కర్మనిష్ఫలం
బోవఁగ నింక భోగములఁ బొందుట యెన్నఁడు? యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మాకపుఁగిళ్ళు సుఖించుటే గదా!'

అని యజ్ఞ ఫలాపేక్ష లక్ష్య సిద్ధి సురకన్యల కౌగిలిఁజేరి సుఖించుటకే నని చమత్కరించినది వరూధిని. పైగా ప్రవరుని నిట్లర్థించెను.

సీ. సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కనటువో బీరెండఁగరఁగి కట్టిలనంటి
గమ గమ వలచు చొక్కపు జవాజి
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుఁదాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండిన యట్టి తుహిన జలము

తే. వివిధ కుసుమ కదంబంబు దివిజతరుజ
మృదులవసన ఫలాసవామేయ రత్న
భూషణంబులు గల విందు భోగపరుఁడ
వయి రమింపుము ననుఁగూడి యను దినంబు

పై సీస పద్యము కరిమ తేటగీతి తృతీయ పాదములో 'భూషణంబులు గల విందు' వరకు వరూధిని గృహమునందు గలవని వర్ణించుటలో నౌచిత్యము చెదరక బాగుగనున్నది ఆ తరువాత రెండు సూర్యగణములు తేటగీతి ముగింపునకై వాడిన చతుర్థ పాదము ప్రయోగమున నుడివి తీరు అసభ్యముగ నుండి గర్హనీయముగ నున్నది చతుర్థ పాదము తీరు మరొక విధముగ రచించి బాగుండెడిది కదా!

'వయి సుఖింపుము మా యింట పరమ పూజ

పై తేట గీతిలో చతుర్థ పాదము పై కీర్తి వరూథిని పల్కిన ఔచిత్య పోషణ కమనీయ రమణీయముగ నుండి వాచ్య దోషము సంభవించెడిది కాదు. విజ్ఞులైన కవిశ్రేష్టులు పై పాద సంస్కరణావశ్యకత గూర్చి యోచింతురని నా విన్నపము.

ఎంతటి శృంగార మహాప్రబంధమైనను యింత పచ్చి శృంగార పదప్రయోగము అశ్లీలమును 'వెఱ్ఱివేయి విధములు'అనెడు నానుడి గుర్తుకు తెచ్చుచున్నది.

పెద్దన కవీంద్రులు పదౌచితిని తన కవితా ఝరీ వేగములో గుర్తింప యుండలేరని నా గాఢ విశ్వాసము.

క. అంధునకుఁ గౌఱయె వెన్నెల ?
గంధర్వాంగనల పొందుగాదని సంసా
రాంధువున దూరె దకట' ది
వాంధము వెలుఁగుగని సొంది నడఁగిన

పై కందపద్యనందు పాతకోత్తములు నిశిత దృష్టిఁ గమనించినచో నింకొక క్రొత్త విషయమును దెలియఁగలరు. 'గంధర్వాంగనల పొందు గాదని' బహువచన ప్రయోగము చేయబడుటలో నౌచిత్యము కాన రాకున్నది. ఏల ననఁగా ప్రవరుని వలచిన మరున్నారీ శిరోరత్నముగా తొల్లి పేర్కొనఁబడినది వరూథిని యొక్కరితయే!' (చూ. ఆ2 పద్యము 25). ఆ దేవకన్యకు 'ఘృతాచీ తిలోత్తమా, హరిణీ, హేమా, శశిరేఖలు దార గుణాఢ్యలు మదీయ ప్రాణసఖుల్'అని వరూథినియే పేర్కొన్నది. (చూ ఆ 2 పద్యము 44)

కనుక "గంధర్వాంగనల పొందుగాదని" పల్కుటలో నౌచిత్యము పాటించబడినట్లు కానఁబడదు గదా? వరూథిని తన పొందునే గాక తన ప్రాణసఖుల పొందుఁ గూడ సుగమమని ప్రత్యక్షముగాఁ జెల్పుచున్నది ప్రవరునికి. పైగా, 'దివాంధము వెలుఁగు గని గొంది నడఁగిన భంగిన్' అని ధర్మ కర్మాచరణ వ్రతుడైన ఏకపత్నీవ్రతుఁడై పరదార ధనాదులు గోరని సద్గుణాఢ్యు ప్రవరుని సంసారాంధువుతె దూరెదకట! అని తన యనుచితమైన గోర్కెను బలపరచుకొనుటయే గాక ఈసడింపుగా పల్కుచు దుర్భాష లాడినది. అదే చిత్త ప్రవృత్తిని భిన్న భిన్న రూపముల ప్రదర్శించినది. గమనించుడీ క్రింది వృత్తమును.

ఉ. ఎన్ని భవంబులం గలుగు నిక్షుశరాసన
సాయక వ్యథా
భిన్నత వాడి వత్తలము కేలఁ గపోలము
లూఁది చూపులన్
విన్నఁదనంబు దోపఁ గనువేఁదురునం
బయిగాలి సోఁకినన్
వెన్న వలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁ
జేర్చు భాగ్యముల్,

ఎన్ని జన్మల నెత్తిన గలుగు... 'వెన్న వలెన్ గరంగునలివేణులఁ గౌగిట! జేర్చు భాగ్యముల్' అని శృంగార రస ...

ప్రియోక్తులు చిలుక వలె చిక్కఁగ పల్కిన యీ వరూధిని, స్థితప్రజ్ఞుడైన ప్రవరుని ప్రసన్నునిఁ జేసికొను ప్రయత్నము విఫలము గాక సఫలముగావలె నని పరిపరి విధముల యోచన జేసిన జాణ! ఈ కలికి ప్రవరుని పట్ల నిక్షుశరాసన సాయకి! పలుకుల ములికి! రత్యాశా కాముకి!!

వరూధిని చిత్త ప్రవృత్తిని గ్రహించలేని యవివేకియా ప్రవరుడు?! గ్రహించినవాడు కనుకనే 'వనజేక్షణ! యిట్లు పలుకవరుసయే? వ్రతులై దినములు గడపెడు విప్రులఁ జనునే కామింప? మది విచారము వలదె?' అని వరూధినిని ముందే హెచ్చరించెను. ఆ క్షణముననే ఆమెతో సంభాషణమును ముగించి యుండి తన యూరునకు పావక ప్రసాద లబ్ధంబగు పవన జవంబున నిజమందిరమునకు వెనుదిరిగి పోవలసినది!

అట్లు చేయక, సంభాషణ మామెతో నవిరామముగ సాగించెను. వరూధిని దృష్టిలో చులకన యయ్యెను. కనుకనే వరూధినిలో రతిసంరంభము మితిమీరు చుండెను. ఆమె మతి చెడిన విధముగ తన మనోరథమీడేరెడు వరకు తన యిష్టాను సారము భాషించుచునుండెను. సుతిమించిన రాగమై ప్రవరునికి సిగ్గును వెగటును కలిగించెను.

ఇప్పటి వరకు వరూధినీ ప్రవరుల సంభాషణ ఒక తీరుగనుండినది. ఇక పైనుండి సంభాషణము వాదప్రతివాదముల తీరును తలపించుచుండెను. గమనింపుడు.

క. కుశలత యే వ్రతములనగు
నశనాయా పీడ నింద్రియ నిరోధము నం
గృశుఁడవయి యాత్మ నలఁచుట
సశరీర స్వర్గసుఖము సమకొనియుండన్?

'తాను ఎదురుగ సశరీరముతో స్వర్గసుఖము లభింపనుండ' అని అర్థము. యింద్రియ నిరోధమునం గృశించి పోదగునా? యాత్మనలఁచుచు సశరీర స్వర్గసుఖము సమకొని యుండిన ట్లు తానుండ యని ప్రశ్నించును వరూధిని

తే. అనిన బ్రవరుండు 'నీవన్న యర్థమెల్ల
నిజము కాముకుఁడైన వానికి, నకాముఁ
డిది గణించునె? జలజాక్షి!

అని ప్రతిస్పందించి 'జలజాక్షి!' (పద్మము వంటి కన్నులున్నదానా!) అంటూ ప్రశంసించుచు 'యెఱిఁగితేని-నగరమార్గంబుఁ జూపి పుణ్యమున బొమ్ము.' అని మరల నామె నర్థించుచూ నిరసించును. ఈ రకమైన ప్రవరుని సమాధానముతో వరూధినిలో తన మనోరథము తీరఁబోవు సమయ మాసన్న మగుచున్నదన్న భ్రమ [illegible] నది. దానితో వెచ్చిన యచ్చర ద్విగుణ [illegible] యుత్సాహ యయ్యెను.

ఈ పట్టున పెద్దన కవీంద్రుని వచన రచనము నుటంకించుటయే మేలు! 'అనన్య కన్యా సామాన్య లావణ్య రేఖామదంబునను నొంటి పాటునం గొంటుదనం బెఱుంగక కుఱంగట నున్న యమ్మహీసుర వర కుమారు తారుణ్య-మౌగ్ధ్యంబులజేసి తన వైదగ్ధ్యంబు[1] మెఱయఁగలిగెనని పల్లవించునుల్లంబునం గదురు మదంబున నోసరించక చంచల దృగంచల ప్రభ లతని ముఖాంబుజంబునం బొలయమణి గణచ్ఛాయా కలాపంబులుప్పరం బెగయఁ గొప్ప చకఁజెక్కుచు జక్కవ గిబ్బలంబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమ రసంబునం బంకిలంబులగు హారముక్తా తారకంబుల నఖకోరకంబులన్ గీఱి తీరువడం జేయుచుఁబలితవన తరు కుసుమ కేస

1. వైదగ్ధ్యము = తలపెట్టిన కార్యము నిర్వహించుటలోఁ గల నేర్పు

రంబులు రాల్చునెపంబునం బయ్యెద విడిల్చి చక్క-
సవరించుచు...జేరి యిట్లనియె

శా. 'ఎందేదెందము కందళించి రహిచే నేకాగ్ర
తన్ నిర్వృతిన్
జెందన్ గుంభగతప్రదీప కళికాశ్రీ దోఁప
నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నా
యింపే పరబ్రహ్మ'మా
నందో బ్రహ్మ' మటన్న ప్రాఁజదువు
నంతర్బుద్ధి నూహింపుమా;

తే. అనుచుఁ దన్నొడఁబఱచు నయ్యమర
కాంత
తత్తఱము జూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొదమ నిస్పృహతఁదెలుపు
నొక్క చిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె.

శా. ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁ
గంటిమే? కామ శా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు, మేలౌహో!
త్రయీ ధర్మముల్
పాకంబుల్, రతి పుణ్యమంచు నికనేలా
తర్కముల్? మోక్షల
క్ష్మీ పథ్యాగమ సూత్రపంక్తి కివెపో మీ
సంప్రదాయార్థముల్.

మ. తరుణీ! రేపును మాపు హవ్యముల చేతం
దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణా దృష్టి నొసంగు సౌఖ్యము లెఱుం
గన్ శక్యమే. నీకు? నా
కరణుల్ దర్భలు నెగ్గులున్ ప్రియము
లై నట్లన్యముల్ గా, వొడల్
తిరమే? చెప్పకు తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ
దేనియల్

చ. అనుటయు మాటలేక, హృదయాబ్జము జల్లనఁ
మోము వెల్లనై
కనలుచు నీరు దేఱ తెలిగన్నుల నాతనిఁ
బుల్కుపుల్కునం
గనుఁగొని మాటలం దొడవు గద్గదికం దల
యూఁచి యక్కటా
వనిత తనంతఁదా వలచి వచ్చినఁజుల్కన
గాదె యేరికిన్?

మ. వెతలన్ బెట్టకు మింక నన్ననుచు నీవీ
బంధమూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్
గొప్పునీడన్ దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలాపాతి
దీనాస్యయై
రతి సంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు
పై పాటునన్. 67

శా. ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ
బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌగిలించి యధరం
బానింప 'హా, శ్రీహరీ'
యంచున్ బ్రాహ్మణుఁడోర మోమిడి తదీయాంస
ద్వయంబంటి పో
మ్మంచున్ ద్రోచెఁ గలంచునే సతుల మాయల్
ధీరచిత్తంబులన్? 68

పై రెండు వృత్తములను నిశితంబుగ గమనించిన పాఠకోత్తములు 67 మత్తేభవృత్తము 4వ చరణములోని పదముల(క్రిందఁగీతలుంచుటకు గల కారణ ముఖ్యోద్దేశ్యమును) అటులనే 68 శార్దూల వృత్తము ద్వితీయ చరణములో గీత నుంచిన పదముల యౌచిత్యమును గ్రహించ గలరని యాసింతును.

వరూథిని తొందరపాటు 67వ వృత్తములో తెలియగలరు. 68వ వృత్తములో వరూథిని కామో ద్రిక్తయై యుక్తాయుక్త విచక్షణా-రహితయై ప్రవ రుని పైఁగల మోహపరవశతఁగౌఁగిలించి యధరం బానించునో లేక యధరం బానించునో గ్రహింతు రని యాసింతును.'కామాతురాణాం నలజ్జా నభయం' అనెడు నానుడి వరూథిని పట్ల యదార్థమయినదని నాభావము-సహేతుకముగ నున్నది.

కం. క్రోపు వడి నిలిచి ఘన ల
 జ్జానపరవశ యగుచుఁ గొప్పుసవరించియొడల్
 దీపింప నతనిఁ జూచు చుఁ
 గోపమునం జూచి క్రేఁటు కొనుచున్ బలికెన్.

వరూథినికి ఘనమైన లజ్జ యుండినట్లు పెద్దన కవీంద్రులు చెప్పిరి. కాని ఈ యభిప్రాయములో యదార్థము ఎంత? నేతిబీరలో నేయి చందమును తలపించు నున్నది!

ఉ. పాటున కింతు లోర్తురె? కృపా రహితాత్మక! నీవు త్రోవ ని
 చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ, గనుంగొను మంచుఁ జూపి య
 ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గల స్వనంబుతో
 మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందు వందగన్.

పై ఉత్పలమాల నడచిన తీరు హృద్యముగ ననవద్యముగ నుండి, చదువరుల మనసును గిలి గింతలిడుచున్నది. వృత్తములో ద్వితీయ చర ణము మిక్కిలి రామణీయకముగనున్నది. 'ఇచ్చోట భవన్న ఖాంకురము సోఁకెఁ గనుం గొను మంచు జూపి' యన్నపుడు పాఠకుని మనమున పెద్దన కవ నములోని యింపు సొంపులతో బాటు వరూథిని 'విద్యుల్లతావిగ్రహన్' అన్న పెద్దన వర్ణనము గూడ తళుక్కున మెరిసి మటుమాయమగును.

ఈ వృత్తము ఉత్పలము గనుక ప్రఫుల్లముగ నున్నది. పెద్దన కవీంద్రుల రస దృష్టికి ప్రౌఢ కవితా సృజనాత్మక శక్తికి తార్కాణం!

క. ఈ విధమున నతి కరుణము
 గా వనరుహనేత్ర కన్నుఁ గవ ధవళ రుచుల్
 కావిగొన నేడ్చి వెండియు
 నా విప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్

ఉ. చేసితి జన్నముల్, తపము చేసితి నంటి, దయావిహీనతం
 జేసిన పుణ్యముల్ ఫలము సెందునె?
 పుణ్యము లెన్ని యేసియున్
 జేసినవాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధికో
 భూసురవర్య! యింత దలపోయవు?
 నీ చదువేల చెప్పుమా?

భూతదయ గలిగి చేసినవి యాగములు, తపము లెవ్వియైన ఫలప్రదములు కాగలవని, భూత దయలేని వెవ్వియైననెన్నియైన నిష్ప్రయోజనము నిరర్థ కములని నిష్కర్షగ పలికినది కాముకి విరహిణి యైన వరూథిని. ప్రవరుని సూటిగ దూషించినది. తన వైదగ్ధ్యము దగ్ధముకాగా, అందని ద్రాక్షల కట్టు జాతు తన యవివేకమును కప్పిపుచ్చ కొను టకై 'నీ మహాత్మ్యంబెంత ఘనము?' అని ప్రవరుని ప్రశ్నించినది. ఈ క్రింది సీస పద్యమును గమ నింపుడు.

సీ. బాడబులు పరాశరుఁ బట్టి
 దాసకన్యాకేళిఁ దప్పఁజేసి!
 కులములో వన్నె తక్కువ యయ్యెగాధి
 పటికి మేనక చులకకము?

ననుపుకాఁడై వేల్పు నాగ వాసముఁగూడి
మహిమఁ గోల్పడియెనే మాందకర్ణి?
స్వారాజ్య మేఁగ నీరైరె సురలహా
లా? జారుఁడైన జంభాసురారి?

తే. వారికంటెను నీ మహత్యంబు ఘనమె?
పవన పర్ణాంబు భక్షులైనవసి యినుప
కచ్చడాల్ గట్టు కొను ముని ప్రముచ్చులెల్ల!
దామరసనేత్ర లిండ్ల బందాలు గారె?
తామరసనేత్ర లిండ్లబందాలుగారె?

అని ఎకసక్కెము లాడిన వరూధినితో మారు మాటాడక ప్రవరుడు పావక ప్రసాద లబ్ధం బగు పవన జవంబున నిజమందిరంబున కరికి నిత్యకృత్య సత్కర్మ కలాపంబులు నిర్వర్తించె నని మార్కండేయుడు క్రోష్టికిం జెప్పెనని ద్వితీయాశ్వాసము ముగించెను.

ఈ విధముగ ప్రవరుని హిమాచల యాత్ర ముఖ్యోద్దేశ్యము, వరూధినీ ప్రవరుల సంభాషణా క్రమము, అందుగల వైరుధ్యము సంపూర్ణము.

# ప్రకృతి

ఐ. సీతారమాదేవి

నీ కనుల కంచెకు అవతల
ఎంత అందమైన ప్రకృతి!
సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలూ—
ఈ ప్రకృతి ధరించిన మెరిసే ఆభరణాలు
వృక్షాలు, నదులు, పర్వతాలూ—
ఈ ప్రకృతి కంఠంనుండి జాలువారే మనోహర గీతాలు
మనిషీ!
తెరు నీ కనురెప్పల తలుపులు
అందమైన ఈ ప్రకృతి శోభను
ఆనందంగా పరికించు
జీవిత సమస్యల మంటల్లో
కాల్చకు నీ సౌందర్య రసాస్వాదనని!

# కార్ల్ మార్క్స్ జీవితము

పొన్నగంటి హనుమంతరెడ్డి

మహాపురుషుల పేర్లూ, కార్యాలు యుగయుగాలు నిలిచిపోతాయి. అలాంటి మహాపురుషలలో అద్భుత సిద్ధాంతవేత్తా, శ్రామికవర్గ నాయకుడైన కారల్ మార్క్స్ ప్రముఖుడు. ప్రకృతి, సమాజం, మానవ ఆలోచనల అభివృద్ధిని శాసించే సార్వత్రిక సూత్రాల గురించిన ఉపదేశాన్ని గతితార్కిక చారిత్రక భౌతిక వాదాన్ని మార్క్స్ సృజించాడు. ఆవిధంగా ప్రపంచాన్ని బాగా గ్రహించడానికే గాక ప్రపంచ విప్లవ పరివర్తనకు కూడ తోవ చూపాడు. తద్వారా చరిత్రకు మార్క్స్ గొప్ప సేవ చేసినాడు. పెట్టుబడిదారీ విధాన పతనం, కమ్యూనిస్టు సమాజ విజయం అనివార్యమని శాస్త్రీయంగా రుజువు చేయడంద్వారా అప్పటి వరకూ మానవజాతికి మంచి భవిషత్తు అనే అస్పష్ట స్వప్నాన్ని, సోషలిజాన్ని శాస్త్రంగా మార్చినవాడు కార్ల్ మార్క్స్.

కారల్ మార్క్స్ 1818మే 5వ తేదీన ట్రియర్(ప్రష్యాలోని రైన్‌రాష్ట్రం)లో ఒక న్యాయవాది కుటుంబంలో జన్మించాడు. రైన్ రాష్ట్రం ప్రష్యాలో పారిశ్రామికంగా అత్యంత అభివృద్ధి చెందిన ప్రాంతాలలో ఒకటి. 1830 నుండి 1835 వరకు మార్క్స్ టయర్ జిమ్నాసియం (సెకండరీ స్కూలు)లో చదివాడు. మార్క్స్ 'వృత్తిని ఎన్నుకొనే విషయంపై యువకుని ఆలోచనలు' అనే వ్యాసాన్ని పట్టభద్రుడవడానికి రాశాడు. 16సం॥ల నాడే మానవ జాతికి నిస్వార్థసేవ చేయడమే తన ధ్యేయంగా నిశ్చయించుకున్నట్లుగా యీ వ్యాసం తెలుపుతుంది. ఆ తరువాత మార్క్స్ మొదట బాన్‌లోను, బెర్లిన్ యూనివర్సిటీలోను 'లా' అధ్యయనం చేశాడు. తను ఎన్నుకున్నది న్యాయ శాస్త్రమైనా ఆ సమయంలో తత్వశాస్త్రంలోను, చరిత్రలోను మార్క్స్ శ్రద్ధ వహించాడు.

జర్మనీలోను, ఇతర యూరోపియను దేశాలలోను పెద్ద చారిత్రక ఘటనలు పరిపక్వమవుతున్న సమయంలో మార్క్స్ శాస్త్రీయ, రాజకీయ అభిప్రాయాలు రూపొందాయి. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధితో పాటు యూరోపియన్ దేశాలలో ఫ్యూడల్ సంబంధాల అవశేషాలు మరింత ఎక్కువగా దుస్సహమయ్యాయి. యంత్రాల ప్రవేశం, భారీ తరహా పెట్టుబడిదారీ పరిశ్రమాభివృద్ధి, రైతుల, చేతివృత్తుల వారి వినాశానికి దారి తీసాయి. శ్రామిక వర్గం-ఉత్పత్తి సాధనాలన్నీ పోగొట్టుకున్న నూతన వర్గం-ఏర్పడడానికి దారితీసే రోజులవి. పశ్చిమ యూరప్ దేశాలలో పెట్టుబడిదారీ విధానం తల ఎత్తడంలో వర్గపోరాటం తీవ్రతరమైనది. బూర్జువా-ప్రజాతంత్ర, జాతీయ విమోచన ఉద్యమాలను అభివృద్ధి పరిచింది. పెటుబడిదారీ దోపిడికి వ్యతిరేకంగా ప్రాథమికమైన సహజమైన అసమ్మతిని ప్రతిబింబించే చారిత్రక శక్తిగా శ్రామిక వర్గం తలెత్త

డానికి కారణమైనది. పెట్టుబడిదారీ వర్గంలోనూ, మేధావులలోనూ వివిధ ప్రతిపక్ష ధోరణులు, కూటములు తలెత్తడము మొదలైన తరుణమది.

హెగెల్ తాత్విక చింతన నుండి సమూలమైన మార్పులతో కూడిన నిర్ణయాలను తీసికుంటున్న యువ హెగెలియన్‌తో కలిసిమెలసి తిరుగుతున్న కాలంలోనే తన విద్యార్థి దశలోనే హెగెల్ రచనలతో మార్క్స్‌కు పరిచయం మొదలైనది. మార్క్స్ "డెమొక్రిటస్ ప్రకృతి తత్త్వ శాస్త్రానికి ఎపిక్యురస్ ప్రకృతి తత్వ శాస్త్రానికి గల విభేదాన్ని గురించి ఒక వ్యాసం రాశాడు. ఈ వ్యాసాన్ని మార్క్స్ 'యేనా' యూనివర్శిటీకి సమర్పించెను.... 1841 ఏప్రిల్ డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీని పొందారు.

యూనివర్శిటీ చదువు ముగిశాక శాస్త్రీయ కృషికి అంకితము కావాలని మార్క్స్ బాన్‌లో ఆచార్య పదవి సంపాదించాలనుకొన్నాడు. అది తన ఆలోచనను తలక్రిందులు చేసింది.

1842 ఏప్రిల్ రైనిషె జైటుంగ్ అను పత్రికలో సిబ్బందిగా చేరి అక్టోబరులోనే దానికి సంపాదకుడయ్యెను. ఈ పత్రిక మార్క్స్ సంపాదకత్వంలో ప్రష్యాలోను జర్మనీ అంతట వ్యాపించిన సామాజిక, రాజకీయ, ఆధ్యాత్మిక పీడనలకు వ్యతిరేకంగా ఆయన ధైర్యంగా పోరాటం సాగించాడు. అతడెన్నో వ్యాసాలను ప్రచురించాడు. జర్మనీ రాజకీయ జీవితం, శ్రమజీవుల పరిస్థితుల గురించి పత్రికానుభవం మార్క్స్‌కు ఎక్కువ పరిజ్ఞానం కలుగచేసింది 1831, 1834 సం॥లలో ల్యాన్స్ కార్మికుల తిరుగుబాట్లు, 1830 చివరలో బ్రిటన్‌లో శ్రామికవర్గ విప్లవోద్యమ వెల్లువ 1842 లో పతాకస్థాయికి చేరడం, కార్మికులు సాగించిన తదితర పోరాటాలు చాలా చారిత్రక ప్రాముఖ్యం కల్గి వున్నాయి అప్పటి నుండి పెట్టుబడిదారీ వర్గానికి శ్రామికవర్గానికి మధ్య పోరాటం బాగాఅభివృద్ధి చెందిన యూరపియన్ దేశాలలో ప్రధానసమస్యగా తయారయినది. రైనిషె జైటుంగ్ 1843 ఏప్రిల్ 1నుండి ప్రచురించరాదనియు 1843 జనవరి 19న నిషేధము చేయబడింది. మార్చి17న సంపాదకత్వానికి మార్క్స్ రాజీనామ యిచ్చెను. అమలులోనున్న ప్రతి విషయాన్ని విమర్శించాలని మార్క్స్ అభిప్రాయం జర్మనీని విడిచిపెట్టి ముందు తన బాల్య స్నేహితురాలైన జెన్నీవాన్ వెస్ట్‌ఫాలెన్‌ను మార్క్స్ పెండ్లి చేసికొన్నాడు. హెగెల్ 'ఫిలాసఫీ ఆఫ్ రైట్' విమర్శనాత్మకంగా అధ్యయనం చేసెను. 1843 అక్టోబరు చివరలో మార్క్స్ పారిస్‌కు వెళ్ళాడు. ఫ్రెంచి ఉటోపియన్ సోషలిస్టులైన ఎటిన్నే కాబెట్ పీరిలెరో, లూయీ బ్లాంక్, పీరి ప్రౌధన్‌లతో పరిచయం చేసుకున్నాడు. యం.ఏ. బకానిక్, వి.పి. బోట్కిన్ రష్యన్ రాజకీయ వ్యక్తుల గూర్చి తెలిసికొనెను. ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డో మొ॥లగు ఆర్థిక శాస్త్రవేత్తల రచనలు అధ్యయనం చేసి మార్క్స్ 1844 లో పెట్టుబడి దారీ రాజకీయ ఆర్థిక శాస్త్రంపై బృహద్విమర్శన గ్రంథాన్ని రచించాడు. కార్మికుల జీవితంతో, వారి పోరాటంతో మార్క్స్‌కు పరిచయము కల్గెను. దోపిడీ నుండి తననూ యావత్ మానవజాతిని విముక్తి కల్గించే సామర్థ్యము శ్రామిక వర్గానికి సేవ చేయడముగా భావించాడు. శ్రామికవర్గ ఆశయాల పోరాటంలో మార్క్స్‌కు ఏంగెల్స్ తోడైనాడు.

మార్క్స్, ఏంగెల్స్‌లు తత్వవేత్తల 'ఆత్మాశ్రయ భావవాద అభిప్రాయాలను విమర్శించుతూ ఒక సిద్ధాంత థీసిస్ తయారు చేశారు. ఇది చారిత్రక భౌతిక వాద ప్రధాన సూత్రాలలో ఒకటి. అనగా చరిత్రను నిర్మించేది వీరుడు కాదని, ప్రజానీక సందోహమే వాస్తవంగా చరిత్ర నిర్మాతలని యీ గ్రంథం తెలుపుతుంది. ఈ గ్రంథంలో

సోషలిస్టు సమాజ నిర్మాతగా శ్రామిక వర్గం యొక్క చారిత్రక పాత్రను బహిర్గతం చేయడమే ముఖ్యాంశం. డాయిషే ఫ్రాన్జోసిషెయార్ బ్యూషెర్ మొదటి సంచిక వెలువడెను. ఈ రచనతో ఆర్నాల్డు రూగెకూ మార్క్స్‌కు తీవ్ర విభేదాలు తలయెత్తాయి.

ప్రష్యన్ ప్రభుత్వ ప్రతిడిఫలితంగా మార్క్స్ యింకా అనేకమంది ఫ్రాన్సు నుండి బహిష్కారం గావించబడినారు. 1845 ఫిబ్రవరిలో బ్రస్సెల్స్‌లో మార్క్స్ నివాసం ఏర్పాటు చేసికొన్నాడు. అసలు సోషలిజం అంటూ బయలుదేరిన పెటి బూర్జువా, ఊహాజనిత, అభివృద్ధి నిరోధక సిద్ధాంతాన్ని 'జర్మన్ ఐడియాలజీ' అనే గ్రంథంలో విమర్శించారు. 1846 ఏప్రిల్‌లో ఈ పుస్తకం పూర్తయినది.

మార్క్స్ చేసిన గొప్ప పరిశోధనా ఫలితం చారిత్రక భౌతిక వాదం. ఇది ప్రపంచ చరిత్రను అర్థం చేసికొనుటలో మలుపును, నిజమైన విప్లవాన్ని సృష్టించింది. భౌతికవాదాలను అభివృద్ధి పరచడంలో పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ అను గ్రంథం మరొక మైలురాయి. 1847 జూన్‌లో లండన్‌లోని న్యాయ సమితి మహాసభ (కాంగ్రెస్)కు పారిస్ శాఖలు ఎంగెల్సును ప్రతినిధిగా పంపాయి. బ్రస్సెల్సుశాఖలు విల్ హెల్మ్ వుల్ఫ్‌ను ప్రతినిధిగా పంపాయి. సమితిని సమూలంగా పునర్నిర్మించాలని కాంగ్రెస్ నిర్ణయము అప్పటినుండి ఇది కమ్యూనిస్టు లీగ్‌గా వ్యవహరింపబడుతూ వచ్చినది. 'మానవులంతా సోదరులే' అనే పాత దీక్షా వాక్యం స్థానే మార్క్స్, ఎంగెల్సు సూచించిన 'సమస్త దేశ కార్మికులారా! ఏకంకండి' అనేదీక్షా వాక్యం స్వీకరించబడింది. న్యైనిషెజైటుంగ్ స్వభావం 1848 జూన్‌లో పారిస్ కార్మికుల తిరుగుబాటుకు తోడ్పడింది. తిరుగుబాటు దారులను మార్క్స్ ప్రశంసించాడు. కొలాన్‌లోను, వియన్నాలోను విప్లవాలు (కార్మికులు, రైతులు) మొదలైనాయి. ఈ విప్లవాల ఫలితంగా తిరుగుబాటులు డిసెంబరు 5న జారీ అసెంబ్లీని రద్దు చేశాయి.

ప్రష్యాలో మార్క్స్‌పై, జైటుంగ్ పత్రికపై నిర్బంధ విధానము ఇనుమడింప చేసింది. 1849 ఫిబ్రవరి 7న మార్క్స్, ఎంగెల్స్‌పై అధికార ధిక్కార నేరం'మోపి కోర్టులో హాజరుపరచబడ్డారు. వీరిపై రాజద్రోహనేరానికి అభియోగంమోపబడింది. 1851 మేలో అనేక పట్టణాలలో కార్మికులను అరెస్టు చేశారు.

లండన్‌లో వున్న కాలంలో మార్క్స్ ముగ్గురు బిడ్డలను పోగొట్టుకొన్నారు. సామాన్య ప్రజానీకం, సాధారణంగా మధ్యతరగతి ప్రజలు, మొత్తం బీద వర్గాలు కలిసి కట్టుగా ఏకం కావాలని మార్క్స్ ఆలోచించాడు. జర్మనీ, హాలెండు, రష్యాలలో ఈ ప్రయత్నము కన్పించుతుంది ఇంటర్నేషనల్ వర్కింగుమెన్సు అసోసియేషన్ ప్రారంభోపన్యాసం 1964లో జరిగింది. అసోసియేషన్ తాత్కాలిక నిబంధనలు మార్క్స్ రచించాడు. మార్క్స్‌పై ఇంటర్నేషనల్ లండను మహాసభ 1864 లోను, జెనీవా కాంగ్రెసు 1866లోను పోరాటం ప్రారంభమయినది. బ్రస్సెల్స్ కాంగ్రెసు 1868, 1869లలో భూమిని సమాజపరం చేయాలని, ఉత్పత్తి సాధనాలను సమిష్టి యాజమాన్యం క్రిందకు తేవాలని పట్టుపట్టాయి. మార్క్స్ నాయకత్వాన జనరల్ కౌన్సిలు దోపిడి యుద్ధాలకు, విమోచన యుద్ధాలకు మధ్య తేడా గమనించింది. ఫ్రెంచి కార్మికుల కర్తవ్యాలను మార్క్స్ నిర్వచించుతూ రిపబ్లిక్ వలన కల్గిన స్వేచ్ఛ ద్వారా లభించిన సాధనాలన్నింటిని వారు ఉపయోగించుకొని తమ స్వంత వర్గ సంఘాన్ని బలపరచుకోవాలని చెప్పాడు. ఫ్రాన్స్‌లో వర్గ పోరాటం తీవ్రమౌతుందని ముందుగానే గ్రహించి సన్నాహంలేని అకాల తిరుగుబాటుచేయ

రాదని గ్రహించి కార్మికులను హెచ్చరించాడు. 1871 మార్చి 18న కార్మికుల విప్లవవార్త లండను చేరినది. పారిస్‌లో తిరుగుబాటు చేయాలని మార్క్స్ తొందరపడ్డాడు. పారిస్ కమ్యూన్ ఓడిపోయింది. జర్మనీలో 1871లో బూర్జువా జాతీయ ఉద్యమం గెలుపొందింది. యుగాలుగా నిద్రపోతున్నది ఆర్థ భూస్వామ్యరష్యా. మార్క్స్‌కు చరిత్రలో అపార అభిరుచి కలదనుటకు 1879-80లో కూర్చిన వివరమైన 'నోట్సు ఆన్ ఇండియన్ హిస్టరీ'లోను, 1881-82 ప్రపంచ చరిత్రపై అనేక సంపుటాలుగాకూర్చిన భాగాలలోను చూడవచ్చు.

మార్క్స్ ఏ రంగంవైపు తన దృష్టిని సారించినా చారిత్రకంగా చలనాత్మక విప్లవశక్తి కల్గినవాడని ఎంగల్స్ అభిప్రాయము. అంతర్జాతీయ కార్మిక ఉద్యమంలో మార్క్స్‌కు అద్భుతమైన పలుకుబడి ఉందని 1881లో ఎంగెల్సు రాశాడు. మార్క్స్ మానవాతీతమైన మానసిక శ్రమ, నిరంతర లేమి ఆరోగ్యాన్ని కూల్చివేశాయి బంధువుల, మిత్రుల పట్టుదల వల్ల ఆరోగ్యం కుదుట పడేందుకు 1874, 1875, 1876లలోను కారల్స్‌బాడ్ వెళ్ళాడు 1881 డిసెంబరు 2న ఆయన భార్య చనిపోయినది. మార్క్స్‌కు ఐదుగురు పిల్లలు. 1883 లో బ్రోంకైటిస్‌తో మరోసారి మంచాన పడ్డాడు. ఆయన శక్తి కోల్పోయాడు? 1883 మార్చి 14 న తేదీన మార్క్స్ తన పడక గది నుండి అధ్యయన గదిలోకి అడుగిడి కుర్చీలో కూలబడి శాశ్వతంగా కన్ను మూశాడు. మార్క్స్‌ను లండనులోని హైగేట్ శ్మశానంలో సమాధి చేశారు. గొప్ప పండితుడు, విప్లవకారుడూ, మహోజ్జ్వల సాహసి, యావత్ మానవజాతి సుఖమయ భవిష్యత్తు కోసం నిస్వార్థ సేవ, వీరోచిత పోరాటాలను పలువురు ప్రస్తుతించారు. మార్క్స్ పేరు, అలాగే ఆయన కృషి యుగయుగాలుగా నిలిచిపోతుంది. మార్క్స్ లెనిన్‌ల ప్రబోధాలు కమ్యూనిజానికి మార్గాన్ని చూపే వేగుచుక్క లాంటివని చెప్పవచ్చు.

## ధ్రువతార

రేగులపాటి కిషన్‌రావు

తెలుగుజాతి గర్వించే
కవివి నీవు సినారె.
సారస్వత గగనమందు
రవివి నీవు సినారె.
కవితలలో సుధలు నింపి
పంచినావు సినారె.
తెలుగు కవిత అందాలను
పెంచినావు సినారె.
చలనచిత్ర రంగములో
కవితారవు సినారె.
శ్రోతల హృదయాల లోన
ధ్రువతారవు సినారె.

పుస్తక సమీక్ష

# శ్రీరామ వచనములు

సంపాదకులు : కపిలవాయిలింగమూర్తి

వెల :- 12-00 రూపాయలు.

ప్రతులకు : వాణీసదనం, విద్యానగర్ కాలనీ,
మహబూబ్‌నగర్ జిల్లా - 509 209.

ప్రాచీన గ్రంథాలను అన్వేషించడం, ఆ అన్వేషణలో సఫలీకృతులు కావడం ఆ యత్నాన్ని కార్యరూపంలో పెట్టి, నలుగురికీ తెలిసేలా చేయడం అనేది సామాన్యమైన పని కాదు. అది ఒక బృహత్తర కార్యం. అలాటి మహత్తర యజ్ఞాన్ని తామే స్వయంగా నిర్వహించిన అదృష్ట శాలి శ్రీ కపిలవాయి లింగమూర్తి.

నాగర్ కర్నూలు తాలూకాలోని 'మంతటి' గ్రామంలో విశ్వబ్రాహ్మణ దొంతోజు పాపయా చారి గారి ఇంట లభించిన ప్రాచీన తాళపత్రి గ్రంథం ''శ్రీరామవచనములు'' 17 అంగుళాల పొడవు. 1 1/2 అంగుళాల వెడల్పు ఉన్న 12 పుటల తాళపత్ర గ్రంథం ఇది.

కృతికర్త (పేరు దొరకలేదు) రామాయణ మును పూర్తిగా చెప్పవలెననే ప్రయత్నం కాన వస్తుంది. గ్రంథం పూర్తిగా లభిస్తే ''ఆంధ్ర సాహితీ దేవత' ధన్యురాలు అవుతుంది.

సంకీర్తనా పద్ధతిలో ''జయరమా రామ-రాక్షస విరామ'' అనే మకుటంలో ఈ రచనలు సాగినాయి. వచన రచనా పద్ధతిలో ఆ మూలాగ్రం భక్తిరసం జాలువారుతూ, రసజ్ఞాలను తన్మయ పులకాంకితులను చేస్తుంది ఈ కావ్యం.

తేట అయిన పావన జాహ్నవీ జలాలవలె కవి భక్తిభావనలో 'గద్య' గీతికలు అణువణువునా స్ఫుటంగా ప్రతిఫలించాయి. 'నీ వంశ కథలు వర్ణించి, నీ చరణరాజీవ సేవకులను కేలు మోడ్చి, నీ హజారముగాచి, నీ చదురున వేత్ర హస్తుడనై బరాబరులు నలిపి నీ కొలువున పరాకు తెలిపి... ముసారు లేని కింకరుని నన్ను రక్షించుటెంత। జయ రమా రామ।''

ఇలా అడుగడుగునా తెలుగుదనాన్ని పుణికి పుచ్చుకున్నాయి ఇందులోని తేనెలూరే పలుకులు.

ద్రాక్షాపాకంతో కదళీ సమంగా కూడా ఈ గేయాలు చదువరులకు చవులూరిస్తాయి. ''ఉద్భట నిశాటయూట భీషణ భవదీయ చాపవిధూత....!'' అక్కడక్కడా సమాస భూయిష్టమై నారికేళ సమాయుక్త మైనప్పటికీ అతి రుచికరంగా సాహితీ దేవత హస్తాలలో చేరిన ఈ రచన ఎల్లరూ తప్పక చదివి తీరవలసినదే !!!

## జిల్లా హిందీ ప్రచారక 'సమ్మేళనోత్సవము', విజయనగరం.

తా. 28-4-91 సాయంత్రం 3 గం॥లకు విజయనగరం బి.ఇడి. కాలేజీలో జిల్లా హిందీ ప్రచారక సమ్మేళనోత్సవము జరిగినది. ఈ సమ్మేళనమునకు హిందీ ప్రచారకులు,హిందీ పండితులు, హిందీ అభిమానులు విచ్చేసిరి.

3 గం॥ నుండి 4 గం॥వరకు ద.భా.హిం. ప్రచారసభ, మద్రాసు, సహకార్యదర్శిగారగు శ్రీ ఎ. రామస్వామిగారి అధ్యక్షతన హిందీ ప్రచారకుల గోష్ఠి జరిగినది. ఇందులో ప్రచారకుల సమస్యలపై చర్చ జరిగినది.

4 గం॥లకు ఒక సభ జరిగినది. విజయనగరం జిల్లా హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ తమ్మన్న శెట్టిగారు, ముఖ్య అతిథులను సభా వేదికపైకి ఆహ్వానించిరి. సుప్రసిద్ధ సమాజసేవకులు శ్రీ ఎల్. కె. జైన్‌గారు అధ్యక్ష స్థానమందు ఆసీనులైనారు. ముఖ్యఅతిథి, మాజీ ఎమ్.ఎల్.సి, శ్రీ పి. ఎల్.ఎన్. రాజు, గౌరవ అతిథి, జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ టి. వి. ఎన్. శాస్త్రిగారలు సభావేదిక నలంకరించిరి. సన్మానిత అతిథులు శ్రీ ఎ. రామస్వామి శ్రీమతి ఎమ్. వేదవల్లిగారు వేదికపై ఆసీనులైనారు.

శ్రీ బి. పి. మిశ్ర ప్రచారక మండలి కార్యదర్శి, సభకు విచ్చేసిన వారికి ముఖ్య అతిథుం





పరిచయం గావించారు. విజయనగర పురజనుల చిరకాల వాంఛ హిందీ ఉపాధ్యాయ ప్రశిక్షణా కేంద్రస్థాపన గూర్చి సభకు తెలియజేశారు.

సభాధ్యక్షులు శ్రీ ఎల్. కె. జైన్‌గారు ఉపన్యసిస్తూ ఉపాధ్యాయ శిక్షణా కళాశాల స్థాపనకు మరియు ధన సహాయము గావించెదనని వాగ్దానము గావించారు. హిందీ ప్రచార కార్యమునకు ప్రోత్సహించుట ఎంతైనా అవసరమున్నదని చెప్పారు. ముఖ్య అతిథులైన శ్రీ పి. ఎల్. ఎన్. రాజుగారు నేడు అందరు హిందీ నేర్చుకొనుట అత్యవసరమనియు హిందీ నేర్చుకొననిదే మనము దేశమందు ఏ కార్యము చేయజాలమనియు, నా మనసు నందు హిందీ అనిన అపార ప్రేమ కలదనియు కావున నేను హిందీ ఉపాధ్యాయ శిక్షణ కళాశాలకు మరియు భవనము సమకూర్చెదనని వాగ్దానము గావించారు. జిల్లా విద్యాశాఖాధికారిగారగు శ్రీ టి. వి. ఎస్. శాస్త్రి గారు, ఈ ఉపాధ్యాయ శిక్షణ కళాశాల స్థాపనకు మా విభాగము నుండి పరిపూర్ణ సహకారమందించెదమని చెప్పారు.

సభాసదుల సమక్షమున శ్రీ ఎ. రామస్వామి గార్కి వేదపండితుల ఆశీర్వాదములతో శ్రీ పి. ఎల్. ఎన్. రాజుగారు శాలువగప్పి, పుష్పమాలలు వేసి ఘనంగా సన్మానించారు. ఆదరభక్తి, శ్రద్ధలతో కరతాళ ధ్వనులతో సభా భవనము ప్రతిధ్వనించింది.

తరువాత శ్రీమతి వేదవల్లిగారిని హిందీ విద్యా మందిర్ ప్రధానోపాధ్యాయిని కుమారి గీతాంజలి గారు దుశ్శాలువను గప్పి మాలవేసి పుష్పగంధాక్షితులతో సన్మానించారు. ఆ తరువాత శ్రీ టి. వి. ఎన్. శాస్త్రిగార్ని, ఎల్. కె. జైన్ గారు శాలువ వేసి పుష్పమాలాంకృతునిగావించి సత్కరించారు. ప్రేక్షకులు కరతాళధ్వనులు గావించి తమ హర్షాన్ని తెలియజేశారు.

ప్రతివచనమందు రామస్వామిగారు కృతజ్ఞత, సంతోషం తెలియజేస్తూ ఇచ్చట గల వ్యక్తులలో గల హిందీ ప్రేమ, ఆదరణ చూచి నేనెంతో ముగ్ధుడనై పోయాను. ఇక్కడి వారల కోరిక సమంజస

మైనది. కాబట్టి ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వారు హిందీ ఉపాధ్యాయ శిక్షణ కళాశాల నెలకొల్పుటకు అనుమతించిన వెంటనే మేము మద్రాసులో కేంద్ర ములు నెలకొల్పుటకు తయారు చేయు మొదటి లిష్టులో విజయనగరం పేరు ఒకటవదిగ ఉండుటకు నేను ప్రయత్నిస్తానని మాట ఇస్తున్నానని చెప్పారు. వారి మాటలు విన్న సభవారి ఆనందము పెల్లు బికినది కరతాళ ధ్వనులతో సభాస్థలి మార్మోగి నది. వేదవల్లిగారు హిందీలో ఉపన్యసిస్తూ హిందీ ప్రచార కార్యక్రమం ఈనాడు బాగుగా విస్తరిస్తూ ఉన్నదని, ఇచ్చట ఇంత మంది సహకరిస్తామని చెప్పుతున్నందున ఈలాంటి చోట తప్పక ఉపా ధ్యాయ శిక్షణ కళాశాల స్థాపించడం చాలా మంచిది నేను కూడ ఈ విషయంలో తప్పక సహకరిస్తానని చెప్పారు.

తరువాత హిందీ ప్రమాణ పత్ర వితరణ, ఎక్కువ మార్కులు సాధించిన వారికి బహుమతి ప్రదానము అతిథులచే గావింపబడినవి.

హిందీ విద్యామందిర్ వారిచే అతిథులకు స్మృతి చిహ్నరూపంగా శ్రీ వెంకటేశ్వరుని మూర్తులు అందచేయడమైనది. బాలురచే గిటారు వాయిద్యము గావింపబడినది. శ్రీ బి.పి. మిశ్ర వందన సమర్పణ గావించారు. రాష్ట్రీయ గీతాలాప నతో సభ ముగిసినది.

## హిందీ ప్రమాణ పత్రాల పంపిణీ

అనకాపల్లి ఉచిత హిందీ విద్యాలయం, జార్జి స్పెషల్ మున్సిపల్ యు. పి. స్కూల్ ఆధ్వర్యంలో సోమవారం (20-5-91) రాత్రి హిందీ ప్రమాణపత్ర వితరణ కార్యక్రమం జరిగింది స్థానిక లింగమూర్తి హాలులో జరిగిన ఈ కార్యక్రమానికి ఎ.ఎం.ఎ.ఎల్. కాలేజీ మాజీ ప్రిన్సిపాల్ డాక్టర్ ఎం. శివప్రసాద రావు అధ్యక్షత వహించారు. ఉపాధ్యాయ సంఘ నాయకులు శ్రీ ఆంధ్ర నర్సింహమూర్తి ప్రమాణ పత్రాలను పంపిణీ చేశారు.

శ్రీయుతులు కె. బెనర్జీరావు, పి. ఎస్. జగ్గా రావు, ఎం. శేషాచారి తదితరులు పాల్గొన్నారు. హిందీ ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష, ప్రవేశిక పరీక్షలలో సెంటర్ ఫస్టువచ్చిన విద్యార్థులకు సభలో బహుమతులు అందించారు.



# నిధి పాలక మండలి సభ్యులు



శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ
మేనేజింగ్ ట్రస్టీ, హైదరాబాదు



శ్రీ మిక్కిలినేని సుబ్బారావు
విజయవాడ



శ్రీ డి. నారాయణరెడ్డి
జనగాం



పరిమి సుబ్బారావు
గుంటూరు



శ్రీ కె. రాజలింగం
నాగనూరు



కె.యస్. ప్రసాదరావు
ఒంగోలు

Edited Printed and Published by P. Prasada Rao on behalf of the D. B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.